# అధిక దిగుబడికి అధిక పోషణనిచ్చే ఎరువులు ముఖ్యం

గ్రోమోర్
**14-35-14**









గ్రోమోర్
**28-28-0**




చేనుకు చేవ, రైతుకు రొక్కం-గ్రోమోర్

కోరమాండల్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్

AIYARS CF-479 TL


హార్లిక్స్: ఛాంపియన్‌లను తయారుచేసే పుష్టికర ఆహారం.
హార్లిక్స్ కుటుంబంలోని ఛాంపియన్ 'రాజు'ని చూడు.






Horlicks
THE IDEAL FOOD DRINK FOR ALL AGES









# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)
శుక్రవారం • 29–11–'74
ఆనందనామ సం కార్తీకమాస శు పూర్ణిమ
*సంపుటము . 68 సంచిక : 11*
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
★
సంవత్సర చందా — రు. 31–20 పై.
ఆరుమాసాల చందా — రు 15–60 పై.
విడిప్రతి వెల 55 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
*గాంధీనగరం, విజయవాడ-3*


## విషయానుక్రమణిక

అట్టమీది బొమ్మ :
'ఊర్వశి'లో శారద

# మనలో మాట

ఈవారంతో 1974 దీపావళి కథల పోటీలో మేము ఎన్నికచేసిన కథలు నాలుగు పాఠకుల ముందున్నాయి వీటిలో ప్రథమ, ద్వితీయ, తృతీయ, చివరి స్థానాలు ఏ యే కథలకు యివ్వాలో నిర్ణయించవలసిన బాధ్యత పాఠకులపై పడ్డది. ఈ సంచికలోనే వ్యాసరచన పోటీ వివరాలుకూడా వేశాము వ్యాసరచన పోటీలో పాల్గొనే వారుకూడా బాలట్ పత్రాన్ని పూర్తిచేసి వ్యాసంతోపాటు పంపాలి వ్యాసంలేకుండా అందిన బాలట్ పత్రాలు చెల్లుతాయికాని బాలట్ పత్రం లేకుండా మా కార్యాలయానికి అందిన వ్యాసాలు పరిగణనలోకి తీసుకోము. వ్యాసాలు తెల్లకాగితం మీద ఒకప్రక్కనే రాయాలి. 800అక్షరాలకు మించకుండా వుండాలి. రచయిత కలంపేరు వాడటంవల్ల పెద్ద ప్రయోజనం వుండదేమో ..ఎందుకంటే విజేతలైన వ్యాసకర్తల పేర్లు, ఫొటోలు, పరిచయం పత్రికలో వేస్తాము కదా! అయినా సర్దావున్న వారు కలంపేరు పెట్టుకున్నా చివర పూర్తి పేరు చిరునామా యిచ్చితీరాలి కేవలం బాలట్‌లో మాత్రమే పాల్గొనే వారు-యీ సంచికలోని బాలట్ పత్రాన్ని పూర్తి చేసి కత్తిరించి పంపవచ్చును వేరేకాగితాలపై వ్రాసిన బాలట్ పత్రాలు చెల్లవు లోగడ ప్రకటించిన విధంగా బాలట్‌లో ప్రథమ స్థానాన్ని పొందిన కథకు ప్రత్యేక బహుమతి రు 650 లు ఆ తరువాత మూడు స్థానాలు పొందిన కథలకు ఆవరసలో రు 550 రు 450 రు 350 లు ప్రత్యేక బహుమతులుగా అందజేస్తాము

* * *

పైవారం నుంచీ కొత్తసీరియల్ ''అహం – అనురాగం'' ప్రారంభిస్తున్నాము రచయిత్రి శ్రీమతి పరిమళా సోమేశ్వర్ మా పాఠకులకు కొత్తకాదు

— — — — — — — — — ఇక్కడ కత్తిరించండి — — — — — — — — —

## దీపావళి కథలపోటీ బాలెట్ పత్రము

| | నాకు నచ్చిన వరుసలో కథల పేర్లు |
|---|---|
| 1. | |
| 2. | |
| 3. | |
| 4. | |

పేరు.................................................

విలాసం.................................................

.................................................

— — — — — — — — — ఇక్కడ కత్తిరించండి — — — — — — — — —

మీ దృష్టిలో ఏ కథ మొదటిస్థానంలో వుంటుందో దానిపేరు ఒకటవ స్థానంలో అలాగే మీ దృష్టిలో తరువాతి స్థానాలలో గల కథల పేర్లను ఆ వరుసలోను వ్రాసి పోస్టు చేయవచ్చు. వ్యాసరచన పోటీలో పాల్గొనేవారైతే వ్యాసంతోపాటు యీ పత్రాన్ని జతచేసి కవరులోనే పెట్టి పంపాలి.

సం

## ఉత్తరాలు

### సినిమా

1973 సంవత్సరపు కేంద్రప్రభుత్వమువారు ప్రకటించిన జాతీయ ప్రాంతీయ బహుమతుల్లో తెలుగు చిత్రాలు లేకపోవటం కేవలం తెలుగు చలనచిత్ర పరిశ్రమకే కాకుండా తెలుగు జాతికే తీరని అవమానం జరిగిందని చెప్పవచ్చు ఈ సంవత్సరంలో తెలుగులో 74 చిత్రాలు నిర్మించడం జరిగింది కాని యీ 74 చిత్రాలలో ఒక్క చిత్రానికి కూడా జాతీయ స్థాయిలోగాని, ప్రాంతీయ స్థాయిలోగాని బహుమతులు రాలేదంటే ఆశ్చర్యంగా ఉంది ఇది చాలా విచారకరమైన సంఘటన తెలుగు ప్రజలు విపరీతంగా ఆదరించిన తాత—మనుమడు, జీవనతరంగాలు, శారద, భక్త తుకారాం మొ ఉత్తమ చిత్రాలు కావా? కావున కేంద్ర ప్రభుత్వమువారు తిరిగి పునః పరిశీలన జరిపించి సకల భారతావనిలో తెలుగు ప్రజలు అవమానంపాలు కాకుండా తగిన న్యాయం చేకూర్చగలరని కోరుచున్నాను మన తెలుగు చిత్ర పరిశ్రమ అభివృద్ధికి శ్రద్ధ చూపుతున్న ముఖ్యమంత్రిగారు యీ విషయంలో జోక్యం కల్పించుకొని కేంద్రముపై తగిన ఒత్తిడి తెచ్చి మన తెలుగు జాతి గౌరవాన్ని కాపాడాలని కోరుచున్నాను తెలుగు సినీ పరిశ్రమలో పెద్దలు, సినీ ప్రేక్షకులు కూడా ఈ విషయాలు గమనించి తగిన శ్రద్ధ చూపించుతారని ఆశిస్తున్నాను

లగడపాటి వెంకటేశ్వరరావు (ఖమ్మం)

### ముఖచిత్రం

1—11—74 ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్రం "మహిషాసుర మర్దని" జి. వెంకటరావుగారి చిత్రణలో కాస్త లోపం ఉంది

మహిషాసురుని వధించినపుడు దుర్గా దేవి రౌద్ర స్వరూపిణియై ఎర్రని నాలుకతో చూపరులకు భయము గొల్పేటట్లు ఉంటుంది వధింపబడేటప్పుడు మహిషాసురుడుకూడా నాలుక బయటకు చాపి యుంటాడు ఇది సాధారణంగా "బొమ్మల్లో" వాస్తవరూపం మరి వెంకటరావు గారు యీ చిత్రించటంలో గల కారణమేమిటో?

ఎం ఎస్ ప్రసాద్, (కాశీబుగ్గ)

### ఒక విజ్ఞప్తి

మేము భారతదేశంలోని అన్ని ప్రాంతాలూ చూసి అక్కడి సంగతులు తెలుసుకున్నాము కాని మన ఆంధ్రప్రదేశ్ లాంటి అభిమానం లేని ప్రాంతాన్ని ఎక్కడా చూడలేదు

భార్య బిడ్డల్ని వదిలి ఒక క్షణంలో తిరగరాని ప్రదేశాలు తిరుగుతున్నాను యుద్ధంలో మా సోదర

# హైదరాబాద్ నోట్‌బుక్

—తిరుమల రామచంద్ర

**సర్దార్ పటేల్ జయంతి :**

వజ్రసంకల్పుడు, ఉక్కుమనిషి, దేశసమైక్య సాధకుడు అయిన సర్దారుపటేల్ 99వ జయంతి అక్టోబరు 31న నగరంలో పలుచోట్ల మహోత్సాహంతో జరుపబడింది తిలక్‌హాలులో రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు వేంకటనారాయణ అధ్యక్షత వహించారు. దేశసమైక్య పరిరక్షణయే పటేల్‌ను గౌరవించడానికి చిహ్నమని ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ఉద్బోధించారు పలువురు మంత్రులు ప్రసంగించారు. పౌరసంబంధ సమాచారశాఖలో డైరెక్టర్ శ్రీమతి రాజ్యంసిన్హా అధ్యక్షత జరిగిన సమావేశంలో డాక్టర్ శ్రీదేవి ప్రసంగిస్తూ తెగలు తెగలుగా ఉన్న స్వదేశ సంస్థానాలను ఒక్కటిగా కలిపి, దేశాన్నేకజాతిగా తీర్చిదిద్దినవాడు పటేల్ అని అన్నారు.

**సోవియట్ పుస్తకప్రదర్శనం :**

సోవియెట్ పుస్తక ప్రదర్శనం అక్టోబర్ 31 నుంచి వారంపాటు కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో జరిగింది ప్రదర్శనం ప్రారంభించిన సాంకేతిక విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ శ్రీ టి ఆర్ దాస్, అధ్యక్షత వహించిన శ్రీ ఎం బోజిరెడ్డి ప్రముఖ నాయకుడు శ్రీ రావినారాయణరెడ్డి, ఉస్మానియా విశ్వవిద్యాలయం రష్యన్ శాఖాధ్యక్షుడు శ్రీ షెల్డియోష్కిన్ వ్లాడిమీర్ వివిధ రంగాలలో సోవియెట్‌యూనియన్ సాధించిన ప్రగతిని,పుస్తక ప్రచురణలో తీసుకున్న శ్రద్ధను, రచయితలకు గల స్థానాన్ని వివరించారు. తక్కిన వివిధ గ్రంథాల మాట ఎలావున్నా "బుడిబుడి నడకల బుడుతలను, చెంగునదూకే చిరుతలను, నవ్వులపువ్వుల గువ్వలను" అనగా పిల్లలను ఆకర్షించే "కంటికి నచ్చే, మనసును మెచ్చేరంగు బొమ్మల బుక్కులు" విశేషంగా ఆకర్షించాయి. మాస్కోలోని ప్రగతి ప్రచురణాలయంలో అందంగా ఆరువందలపుట 'అమ్మ' నవలలో ఆరే తప్పులతో ముద్రితమైన పుస్తకాలను చూస్తూ ఉంటే మన పుస్తకాలలోని శుద్ధశుద్ధ పత్రికలు ఎప్పుడు కుప్పగా కూలిపోతాయో అనే ఆవేదన ఎవరికైనా కలుగకమానదు.

**యువభారతి పానుగంటి :**

వివిధేతివృత్తాలతో 34 నాటికలు, నేటికీఆదర్శప్రాయమైన సాక్షివ్యాసాలూ రచించి తెలుగు సాహిత్యానికి అపారసేవ చేసిన పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిని యువ భారతి తన ప్రతిభాలహరి ఉపన్యాసాలతో నగర సాహిత్య ప్రేమికులకు సంస్మరింపజేసి, మరికొన్నిమైళ్ళు ముందుకు నడిచింది నవంబరు 3వ తేదీన సారస్వత పరిషత్తులో జరిగిన ఈ సభకు అధ్యక్షత వహించిన డాక్టర్ సి నారాయణరెడ్డి ప్రధానవక్త శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి అనారోగ్య కారణంగా రానందువల్ల ప్రసంగించిన డాక్టర్ దివాకర్ల వేంకటావధాని, పానుగంటి ప్రతిభను ఉగ్గడించారు పానుగంటి నాటకాలలో ప్రాచ్య పాశ్చాత్యరీతుల సమన్వయం, సంభాషణచాతురి, అతివేలమైన రచనా సౌందర్యంప్రధాన గుణాలని, సాక్షి ప్రసంగాలు నేటికీ అన్వయిస్తాయని డాక్టర్ దివాకర్ల అనగా, పానుగంటిహాస్యం ఒకొక్కప్పుడు వేల నతిక్రమించినా, సంఘ సంస్కరణకు వజ్రాయుధంగా తోడ్పడిందని డాక్టర్ నారాయణరెడ్డి అన్నారు ముఖ్య మంత్రి శ్రీ పిడతలరంగారెడ్డి మాటలు మాత్రం ప్రతివారు, ముఖ్యంగా ఏ విషయమంటే ఆ విషయం మాట్లాడే మంత్రులు మననం చేసుకోదగినవి "ఈ పండితుల మధ్య, పండితుల సభలో నేనేమి మాట్లాడగలను? శాసనసభలలో నాకువున్నఅను గురించి చెప్పమంటే చెబుతాను. ఇందరు సాక్షుల ఎదుట నాకు సాహిత్య పరీక్ష పెడితే ఎట్లా? మంత్రి మండలిలో పరీక్ష పెట్టండి అని ఆయన చమత్కరించి ముక్తసరిగా మూడు నిమిషాలేమాట్లాడిమురిపితహాస్యాలతోకూర్చున్నారు.



అమెరికాలోని భారత రాయబారి కార్యాలయంలో సెటనేర్ పెర్సీతో మాట్లాడుతున్న శ్రీమతి సుమతీకౌశల్‌ని చిత్రంలో చూడవచ్చు.

**వన్యమృగాల ఫొటో ప్రదర్శనం**

వన్యమృగ సంరక్షణసప్తాహం సందర్భంగా ఆంధ్రప్రదేశ్ అటవీశాఖవారు అక్టోబరు ఎవరివారంలో కళాభవన్‌లో ఏర్పాటుచేసిన వన్యమృగాల ఫొటో ప్రదర్శనం నగర పౌరులను ఆకర్షించి ప్రకృతి మనకు ప్రసాదించిన సుందర వన్యమృగాల పట్ల ఎంతో కరుణ హృదయం కలిగించింది దేవాదాయ మంత్రి శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు ప్రారంభోత్సవం జరిపిన ఈ ప్రదర్శనంలో వివిధ వన్యమృగాల చిత్తవృత్తిని, ఉనికిని తెలిపే 150 ఫొటోలు, పిల్లలు చిత్రించిన, వన్యమృగ చిత్రాలు ఉన్నవి ప్రకృతివరమైన వన్యమృగాల రక్షణ ఎట్ల జనానికి ఆసక్తి కలిగించే ఈ ప్రదర్శనం ఏర్పాటు చేసిన అటవీశాఖ అధికారులు శ్రీయుతులు పి ఎస్ రావు మాథుర్, ఆర్ కె రావు, టి వి సుబ్బారావు, వి. ఎస్. శాస్త్రి అభినందనీయులు.

**నాట్యసుందరి సుమతీ కౌశల్:**

"నేను తెలుగుదాన్ని, చింతాకృష్ణమూర్తి, వేదాంతం జగన్నాథశర్మ, వేదాంతం లక్ష్మీ నారాయణశాస్త్రి గార్లవంటి వారివద్ద శుశ్రూషచేసి తెలుగువారి ప్రాచీన ప్రత్యేక కళ అయిన కూచిపూడి నాట్యంలోని మెలకువలను గ్రహించి మననం, అభ్యాసం చేసుకొంటున్నదాన్ని, కనుక పాశ్చాత్య దేశాలలో కూచిపూడి నాట్యాన్ని ప్రచారం చేయడం నా జీవిత లక్ష్యం. పాశ్చాత్యులకు భరతనాట్యం ఒడిస్సీలను గురించి వారికి కొంచెం తెలుసు. కాని లాస్యప్రధానమైన కూచిపూడిని గురించి అంతగా తెలియదు. ఇప్పుడు ఆసక్తి చూపుతున్నారు. వారి ఆసక్తిని అధికం చేయడం నా ఉద్దేశం" అని వివరించారు వివిధ నాట్య పాఠం గత, 'స్పృత్య శిఖరీ నాట్యవిద్యాలయం" నిర్వాహకురాలు శ్రీమతి సుమతి

వీర సైనికులెందరో మరణించారు వారి భార్యలు అనాథలైనారు. వారి కుటుంబాలు నిరాశ్రయమైనాయి ఎందరో వికలాంగులైనారు

ఇలాంటివారిని గురించి ఆలోచించాలిఆ రాష్ట్రం ప్రజలు, ప్రభుత్వం ఏ రాష్ట్రప్రభుత్వం ఆ రాష్ట్రంలో, వారికి సహాయ సహకారాలని అందించి ఉపాధిని కల్పించాల్సిన అవసరం ఉంది ఎన్నో రాష్ట్రాలు అలా చేస్తున్నవి దేశ రక్షణలో వికలాంగులైనవారికి, సేవానంతరం తిరిగివచ్చినవారికి కనీసం గంజి కాచుకుని తినేందుకైనా మన ఆంధ్రప్రదేశ్‌ప్రభుత్వం ఉద్యోగాలని ఇవ్వాల్సిందిగా ప్రార్థిస్తున్నాను.

## ఉత్తరాలు

అన్ని రాష్ట్రప్రభుత్వాలు చేస్తున్న విధంగానే మన రాష్ట్రప్రభుత్వం కూడా మాజీ సైనికులకి ఉపాధిని కల్పించి తగు సహాయం అందజేయవలసినదిగా వేడుకుంటున్నాము ఇట్లు

ఆంధ్ర సోదరులు

బి హెచ్ ఎం సోల్మన్‌రాజు (కృష్ణాజిల్లా), లాన్స్ నాయక్ జి జ్ఞానము (ప గో జిల్లా), డ్రైవర్ శివయ్య (కడపజిల్లా), డి ఒ పి సుబ్బరాయుడు (నెల్లూరుజిల్లా), జి ఎస్ ఆర్ లక్షన్ (హైదరాబాద్),డ్రైవర్ ఆంతోనిరెడ్డి (కర్నూలు), జి ఎస్ ఆర్ రంగయ్య (కంభం), టి ఎ సత్యనారాయణ (తూ గో జిల్లా)

కథలు

రంగుటద్దాల సినిమా ఫీల్డు అతివల అంతరంగ మోసానికి షీల్డు కథ "సముద్రంలో నీటి బొట్టు" కల్మష సినీ జీవితానికి దర్పణం పట్టు రాసిన ఎస్ కాశీవిశ్వనాథం రమణీయతతో కలం ఒలికినది నిజం అప్పటి శేషుమాంబ నేటి శ్రీదేవిలు నాటి నేటి నీటిలో దెబ్బతిన్న అబలలు

పెబ్బేరి మహమూద్ (కొల్లాపురం)

కవుశల్ ఇటీవల స్వగృహంలో ఏర్పాటుచేసిన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో, శ్రీమతి కవుశల్ నాలుగునెలల పాటు అమెరికాలో పర్యటించి 25 నగరాలలో 30 ప్రదర్శనాలిచ్చి అమెరికా వారిని భారతీయ నాట్యనృత్తాల, ముఖ్యంగా కూచిపూడి నర్తనరీతి సౌందర్యాలతో ఆనందపరచి అక్టోబర్ చివరివారంలో భారతదేశానికి తిరిగి వచ్చారు. జోంటో క్లబ్ ఆహ్వానంపై ఈమె వెళ్లారు 30 ప్రదర్శనాలే కాక, ఫార్గో, మియామీ, వాషింగ్టన్‌లలో టెలివిషన్‌లోను ప్రదర్శనం చేశారు. తెలుగు సాహిత్య సంఘాలలోను, భారతీయుల సంఘాలలోను, కేవలం అమెరికనులేవున్న ఏడు సమావేశాలలో ప్రదర్శన లిచ్చారు "అమెరికనులు భామా కలాపం, తరంగాలు, ముద్రలు, జతిస్వరాలు, కూడ అర్థం చేసుకొన్నారు. నేను ఒడిస్సీ, భరత నాట్యాలు కూడా చేశాను. ఒడిస్సీలో పంచకన్య చాల క్లిష్టమైంది. దానిని రీటా, యామినుల తర్వాత ప్రదర్శించిన దానిని నేనే ఆవ్ హిరత్ విశ్వవిద్యాలయంలోను, శాన్ ఫ్రాన్సిస్కోలో అలీ అక్బర్‌ఖాన్ విద్యార్థి బృందంలోను నేను చేసిన ప్రదర్శనాలు నా కెంతో సంతృప్తి కలిగించాయి." అన్నారు ఆమె స్వాతంత్ర్య దినోత్సవంనాడు భారత రాయబారి శ్రీ కవుల్ ఈమెకు విందు చేశారు. "నేను ఉస్మానియా విశ్వ విద్యాలయంలో డ్యాన్సు ఫ్యాకల్టీని ఏర్పాటు చేయాలని ఎన్నోసార్లు కోరాను. ఇంతవరకు ఏమీ జరుగలేదు అక్కడి కొన్ని విశ్వవిద్యాలయాలు కూచిపూడి నృత్య శిక్షణ ఇమ్మని కోరాయి మనవారికి కళలపై శ్రద్ధ లేదు. అక్కడివారు గౌరవించి నేర్చుకుంటారు. అన్నీ అనుకూలంగా కుదిరితే, వెళ్లి తెలుగువారి నృత్య నాట్యలాస్యరీతులను నేర్పుతాను" అని ఆమె ఆత్మ విశ్వాసంతో అన్నారు. అక్కడి పోరం, ఇండియన్‌వాయ్స్, ప్లెయిన్ డీలింగ్ మొదలైన పత్రికలు శ్రీమతి సుమతి కళానైపుణ్యాన్ని కాలముల తరబడి, ప్రశంసించాయి బాల్టిమోర్ పురపాలక సంఘం ఈమెను బాల్టిమోర్ గౌరవ పౌర సత్వ బిరుదంతో గౌరవించింది. ఆ పత్రికల వార్తలు, చూస్తుంటే, ఆమె చెప్పినది వింటూంటే,

విదేశాలలో నౌకాధికారిగా పెక్కు అనుభవాలు పొందిన ఆమె భర్త శ్రీ కవుశల్ వివరణలు వింటుంటే, "ఆహా! ఈమె మన ప్రాచీన కథా కారులు సుమిత్రా జావాలకు వెళ్లి భారతీయ సంస్కృతిని వ్యాపింపజేసిన సంప్రదాయాన్ని నేడూ అనుసరిస్తూ, ఎంత సేవచేస్తున్నది, ఎంత ధన్యురాలు!" అనుకుంటూ గౌరవంతో, గర్వంతో ధన్యవాదాలు అర్పించి సెలవు పుచ్చుకొన్నాను

**ఉపశ్రుతి :**

"హైదరాబాద్ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ వచ్చాడు ఇక మన పిల్లల సీట్లకు భయంలేదు" అన్నాను "ఆ! ఎవరువస్తేనేం! మన గతి ఇంటి మొగుణికి ఈతచాప, పరాయి మొగుణికి పట్టె మంచం, నడుమన తిరిగే నారిగానికి నగిషీనవార మంచం—అన్న సామెతే"అన్నాడు ఒక అనుభవజ్ఞుడు ●

# పత్రికా డైరీ

## గుండెజబ్బు పెరుగుదల

దేశంలో గుండె జబ్బులు చాలా భయంకరంగా తయారవుతున్నాయట 1942 నుంచి 1972 వరకు తేలిన లెక్కల ప్రకారం గుండె జబ్బులు 225 శాతం పెరిగాయట. చావులకు మూలమైన రోగాలలో ఈ గుండె జబ్బు మూడవ స్థానాన్ని అలంకరించిందిట. ఈ విషయాలన్నీ డాక్టర్ బి కె. గోయెల్ అన్నారట.

## తంతే గారెలబుట్ట తగిలింది

శాన్‌ఫ్రాన్సిస్కోలో 1972 ఏప్రియల్ 28వ తేదీన వో ఆరేళ్ల గుడ్డి కుర్రాడిని రొట్టెలు తీసుకెళుతున్న లారీ ఒకటి గుద్దిందట తత్ఫలితంగా అతను ఆసుపత్రిలో ఆరు వారాలు స్పృహ లేకుండా పడున్నాడట. ఆనక మరో రెండు నెలలు చికిత్సలతోటి పడున్నాడట ఈ సందర్భంగా అతనికి సంబంధించినవారు కేసుపెట్టారట తీర్పులో ఆ బాలునికి నష్టపరిహారంగా ఇరవై లక్షల డాలర్లు యివ్వాలని న్యాయాధిపతులు చెప్పారట బాబోయ్ మనం కూడా వో రొట్టెల లారీ క్రింద పడితే పోదూ!

## శీలం చెడితే. .

చిదంబరం తాలూకాకి చెందిన కల్‌కారి గ్రామంలో ధనపాల్, రామానుజం, ముత్తు తామిజార్ సార్ అనే ముగ్గురన్నదమ్ములు పొలంలో పనిచేసుకుంటున్న తమ చెల్లెలు రాసాయిని భయంకర ఆయుధాలతో చితకబాది, ఆనక ఆమె తలనరికి, తీసుకువెళ్లి వో కాలువలో పారేసి చక్కాపోయారట వీరికి న్యాయస్థానం యావజ్జీవ శిక్ష విధించిందట ఆ వ్యాళ్లని చాలామందితో అక్రమ సంబంధం పెట్టుకున్నదన్న కోపంతో యీ పని చేశారట ఆమెకు వివాహమై ఎనిమిదేళ్లయ్యిందిట.
—అయితే!

## లోయలోకి దొర్లిన బస్సు

కరూరుకు 12 కిలోమీటర్ల దూరంలో ఉన్న వేలకురుచ్చి అనే గ్రామం ప్రాంతంలో వో ప్రయాణికుల బస్సు దొర్లి లోయలోకి పడిపోయిందట తత్ఫలితంగా దాంట్లో ప్రయాణం చేస్తున్న 42 మంది విపరీతంగా గాయపడి ఇదమిత్థమని తేలని స్థితిలో ఆసుపత్రిలో ఉన్నారట వీరంతా మధుర జిల్లాకు చెందిన రెవిన్యూ అధికారులట.

## స్కూటర్‌వాలాని చంపిన గేదెలు

వాండలూరు స్టాండర్డు మోటారు కంపెనీలో పనిచేస్తున్న 35 ఏళ్ల శ్రీనివాసన్ అనే ఆయన 8వ తేదీన చెంగల్పట్టు నుంచి తన వూరుకు స్కూటరులో వెళ్తుండగా, పులిప్పాకం అనే గ్రామం ప్రాంతంలో గేదెల మంద అడ్డు వచ్చి, అవి బెదరి చెదరడంతో ఆయన స్కూటరుమీంచి పడి, వాటి క్రింద పడి చనిపోయాడట.

## మార్ఫియా బదులు ఉమ్మెత్తరసమా!

శస్త్రచికిత్స చేసేటప్పుడు స్పృహ పోడానికి రోగికి యిచ్చే ఇంజక్షనుగా ఉమ్మెత్త రసాన్ని కూడా ఇవ్వవచ్చని చైనా కనుగొన్నదట ఉమ్మెత్త పువ్వు రసాన్ని తీసి (మూడు నుంచి అయిదు గ్రాముల వరకు) రోగికి ఇంజక్షను చేసినా, లేక త్రాగించినా కూడా సుమారు అయిదారు గంటల సేపు స్పృహ ఉండదనీ, కావలసి వస్తే మరో డోసు కూడా ఇవ్వవచ్చనీ అక్కడి శాస్త్రజ్ఞులు అన్నారట.

(45 వ పేజీ చూడండి)






**యం. వి. — బళ్లారి.**

మా పాప వయస్సు 3 సం. లు 1 నెల క్రితం 'ఆటలమ్మ' వచ్చి పొక్కులు చీము పట్టి మానినవి. ఆ చోటు అంతా నల్లగా అయిపోయింది. కాల క్రమేణా ఇవి పోతాయా? మందులు ఏవైనా వాడాలా?

ఆటలమ్మ వచ్చిన తర్వాత ఆ చోట మచ్చలు ఏర్పడటం సహజం. అయితే ఈ మచ్చలు కాల క్రమేణా చర్మపు రంగులో కలిసిపోతాయి. ఇలా కలిసిపోవటానికి ఒకటి, రెండు సం లకూడా పట్ట వచ్చును దీనికి ప్రత్యేకించి మందు అవసరంలేదు.

**పి. ఆర్ — బెంగుళూరు.**

నా వయస్సు 28 సం. లు. మలంలో తెల్లని పురుగులు ఉన్నవి 'పైపరజీన్ సిట్రేట్' వాడితే పోయి మరలా వస్తున్నవి. ఈ మందు ఎక్కువ సార్లు వాడ కూడదని అంటున్నారు. నిరంతరంగా పోగొట్టాలంటే ఏంచేయాలి?

మలంలో చిన్న 'క్రిములు' (త్రెడ్ వర్మ్స్) ఉంటే వాటికి పైపరజీన్ సిట్రేట్ చాలా మంచిది. కాని ఒకసారి పోయి తిరిగి వస్తున్నాయంటే— మీ అలవాట్లలో కొన్ని మార్పులు రావాలి ఆహార పదార్థాలను శుభ్రపరచి వాడటం, మలవిసర్జన సమయంలో పాదరక్షలు వాడటం, కుటుంబంలోని సభ్యులందరికీ ఒకేసారిగా పై మందు వాడటం చేస్తే తిరిగి ఈ క్రిములు జీర్ణాశయంలో ఏర్పడే అవకాశం ఉండదు.

**ఎల్ — బొంబాయి.**

నా స్నేహితురాలు మొదటిసారి గర్భిణి ఆమె స్తనములు నుండి నీరు వలె వస్తోందట దీనివలన ఏమైనా ప్రమాదమా? వైద్యము చేయవలెనా?

గర్భిణిగా ఉన్నప్పుడు, "మామరీ గ్రంథులు" (స్తనములు) పెరిగి— పాల ఉత్పత్తికి తయారవటం సహజం. ఈ సమయంలో నీరు వంటి పదార్థం రావటం సహజం. దీనికి భయపడటం అనవసరం.

**పి. కె — పటమటలంక.**

మాకు 1 సం. వయస్సు గల అమ్మాయి ఉన్నది. రోజల్లా 24 గం లూ శరీరం జ్వరం ఉన్నట్లుగా వేడిగా ఉంటుంది గుంటూరు ఆసుపత్రిలో చూపిస్తే స్వేదగ్రంథులు లేవని తెలియజేశారు ఈ వేసం కాలంలో పాప బాధ చూడలేకపోతున్నాము.

శిశువు గర్భంలో ఉన్నప్పుడు చర్మము— దాని భాగములు సరిగా ఏర్పడకపోవటంవల్ల, స్వేద గ్రంథులు తక్కువ పనితనం కలిగి ఉండటం— లేక అసలే లేకపోవటం జరుగుతుంది. దీనిని "యాన్ హైడ్రాటిక్ ఎక్టో డెర్మల్ డిస్ప్లేసియా" అంటారు. కాలక్రమేణా కొంతవరకూ మార్పు కనబడుతుంది తాత్కాలిక ఉపశమనం మాత్రమే ప్రస్తుత చికిత్స

**వి. వి. ఎస్ — మార్కాపురం.**

'పైల్స్' రావటానికి కారణాలేమిటి? ఇవి వచ్చినట్లు ప్రారంభ దశలోనే తెలుసుకుని రూపు మాపటం ఎలాగ? అసలు రాకుండా చూసుకో వచ్చునా?

పైల్స్ అనేవి చుట్టలు చుట్టుకున్న రక్తనాళములు. మలము వెలువడు ప్రదేశంలో నుంచి చెడు రక్తము తీసుకుని వెళ్లే రక్తనాళములలో అవరోధం ఏర్పడినప్పుడు లేక 'లివరు బాగా దెబ్బతిని దాని వెనుక భాగములో ఉన్న "ఇన్ఫీరియర్ వినేకేవా" అనే రక్తనాళమునకు అవరోధం ఏర్పడినప్పుడు ఈ పైల్స్ రావడానికి అవకాశం ఉన్నది. గుద స్థానంలో నెప్పి, మంట, మలంలో నెత్తురు పోవటం, మలబద్ధకం ఈ రోగ ప్రథమ లక్షణాలు తరచూ వైద్య పరీక్ష, క్రమమైన ఆహారం, మంచి లక్షణాలు, కలిగి ఉండటం తప్ప, ప్రత్యేకించి ఇవి రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు లేవు

**వై. పి — అరదలి.**

టీకాలు వేయించుకొంటే మశూచి రాదంటారుకదా? మా తమ్ముడికి టీకాలు వేసిన 20 రోజులకు మశూచి వచ్చింది. టీకాలు వేస్తే ఇలా రాదని డాక్టర్లు, రేడియోలు చెప్తునట్లుగాకాక ఇలా రావటానికి కారణమేమిటి?

'టీకాలు' అనేది— మశూచి లేక (పెద్ద అమ్మవారు)— "స్మాల్‌పాక్స్"అనే రోగం రాకుండా ఉండడానికి వేసే వాక్సినేషన్ మాత్రమే!

ఆటలమ్మ, పొంగు మొదలయినవాటిని ఈ "టీకాలు" రాకుండా శరీరాన్ని కాపాడలేదు. మీ తమ్ముడికి, 'ఆటలమ్మ' వచ్చి ఉంటుంది.

కానీ, మశూచి (పెద్ద అమ్మవారు) కల గజేసే సూక్ష్మక్రిములు శరీరంలో ప్రవేశించిన తర్వాత, టీకాలు వేయించుకొంటే, లాభంలేదు. ఈ టీకాలు దాదాపు 2 సం. వరకూ పనిచేస్తాయి. తర్వాత 'రీ వాక్సినేషన్— చేయించుకొంటేనే (2 సం. లకొకసారి) ఈ రోగం రాకుండా చూసుకోవచ్చును.

**బి. ఎస్ — రామగుండం.**

మాకు పుట్టిన మొదటి రెండు పాపలు—పురిటి మొదటి రోజుననే చనిపోయినారు (బలహీనంవల్ల) మూడవసారి కూడా— ప్రసవానికి ఒక రోజు ముందే గర్భంలోనే శిశువు చనిపోయింది. ఇలా జరగటానికి కారణమేమిటి? గర్భిణిగా ఉన్నప్పుడు ఆరోగ్యంగానే ఉంటాను.

శిశువు మరణానికి ముఖ్య కారణం— శిశువులు తగినంత బలం కలిగి ఉండకపోవటం. తల్లి ఆరోగ్య స్థితి— శిశువు గర్భంలో సక్రమంగా పెరగడానికి చాలావరకు తోడ్పడుతుంది. తల్లి, పైకి ఆరోగ్యవంతురాలుగా ఉన్నా, కొన్ని రోగాలు శరీరంలో ఉన్నప్పుడు, శిశువు సరిగా పెరగదు. గర్భిణిగా ఉన్నప్పుడు రక్త పరీక్ష, మూత్ర పరీక్ష చేయించుకోవటం, తరచూ వైద్యుల చేత 'టెస్టు' చేయించుకోవటం అవసరం.



డాక్టర్ సలహాలకు ప్రశ్నలు పంపే వారు వారి సందేహం లోగడ సంచికలలో తీరిపోయిందేమో ఒకసారి పాతసంచికలు తిరగవేసి చూసి, మరీ తమ ప్రశ్నలు పంపటం మంచిది. —సం.

సీరియల్

# ఇద్దరమ్మాయిల కథ

**ఎమ్. హేమలత**

[గతసంచిక తరువాయి]

## 5

"అమ్మయ్య! పరీక్షలివాల్టితో ఆఖరు..." అనిత, మాధవి, గంతులేసుకుంటూ బయటికి వచ్చారు.

"మాధవీ! మా యింటికి రావే కాస్సేపు ఆడుకుందాం — తరువాత మీ యింటికి వెళ్లొచ్చు."

"మా అమ్మ ఎదురు చూస్తుంటుంది, అనూ!"

"ఒక్క ఆఫనవర్ వుండి వెళ్లు."

"పోనీ ఒకపని చేద్దామా. మా ఇంటికి వెళ్లి అమ్మకి చెప్పేసి వెళ్దాం. సరేనా?"

అనిత 'ఓ ... కె' అనడం, వాళ్ల జీపు త్రుర్రుమనడం దాదాపు ఒకేమారు జరిగాయ్.

"అమ్మా, అనితొచ్చింది..." జీపులోంచి దుమికి ఇంట్లోకి పరుగెడుతూ అంది మాధవి.

రెండు వాటాల డాబా ఇంట్లో ఒకవేపున వున్న ఆ చిన్న పోర్షను ముందు పేడతో అలికి, చక్కటి పెద్ద ముగ్గు వేయబడివుంది. ముందుప్రక్క రకరకాల పూలకుండీలలో మధ్యగ తులసిమొక్క మహారాణిలా—ఠీవి ఒలక పోస్తూ కూచుంది. అప్పుడే తులసి పూజ అయిన గుర్తుగా కుండీకి పసుపూ కుంకుమలు పెట్టి వున్నాయ్. తులసి మొక్క చుట్టూరా వున్న కుండీలలో లిల్లీ,మరువం, కనకాంబరం మొక్కలు గాలికి అట్టూ—ఇటూ వూగుతూ వచ్చేవారికి స్వాగతం పల్కుతున్నాయ్. అనిత అక్కడే నిలబడింది — మొక్కలకేసి, పువ్వులకేసి ఆసక్తిగా చూస్తూ.

"రామ్మా లోపలికి" బయటికి వచ్చి పిలిచింది సుగుణ. "ఆంటీ! ఈ పువ్వులు చాలా స్వీట్‌గా వున్నాయ్. బ్యూటిఫుల్ కలర్" మెచ్చుకోలుగా అంది అనిత

'ఓ. కనకాంబరం పువ్వులా! నీకంత ఇష్టమా? ఇంటికి వెళ్ళేటప్పుడు పెట్టుకొని వెళ్దువుగానీలే"

"ఎలా ఆంటీ? నాకు జడలేదుగా ...!" షార్ట్‌గా కట్‌చేసిన బాబ్ హేర్‌ని తడుము కుంటూ అంది అనిత.

"పిన్‌పెట్టి నే డ్రెస్‌చేస్తాగా ..." అను నయంగా అంటూ లోపలికి తీసుకెళ్ళింది అనితని సుగుణ.

"అమ్మా! అనితా వాళ్ళింటి కెళ్తామే. తనందుకే మనింటి కొచ్చింది." గారాలు ఒలకపోస్తున్న కూతుర్ని చూస్తే ముద్దొచ్చింది సుగుణకి.

"అలాగే వెళ్దువుకాని! ఇదుగో చూడు. నీకోసరం. అచ్చంగ నీకోసరమే, కష్టపడి పరీక్షలు రాసి ఇంటికి వచ్చిన మా బంగారు పాపాయి మాధవి కోసమని, అరిసెలు వండుతున్నాను. మరివి—నువ్వూ నీ ఫ్రెండూ తిని వెళ్ళండి. అన్నట్టు, మాధవీ భోంచేయవూ?"

"ఇవ్వి అరిసలు తింటూ — ఇంకా భోజనమెందుకమ్మా మూడింటికి వస్తానుగా. అప్పుడు భోంచేస్తాను."

"అబ్బ! ఎంత బాగున్నాయి మాధవీ ఈ స్వీట్సు. మా మమ్మీ ఎప్పుడూ చేయలేదు మా మమ్మీకి కూడా రుచి చూపించాలి!"

"ఓ. యస్. అల్లాగే ఓ అరడజను అరిసెలు పట్టుకెళితే సరి"

"అయ్యో! ఎలాగా? మా అమ్మగారు ఇప్పుడింట్లో లేరు. మా అంకుల్. ఆంటీ కాశ్మీర్ వెళుతూంటే మా మమ్మీ కూడా వాళ్ళతో వెళ్లింది. వెళ్లి వారం రోజులయింది ..." రెండవ అరిసెను పంటితో కొరుకుతూ అంది అనిత.

> *జరిగిన కథ : 1* కాన్వెంటు చదువు భరించడం కష్టమయినా, మంచి విద్య నేర్పించాలని కూతురు మాధవిని కాన్వెంట్‌లో చేర్పిస్తారు సుగుణమ్మ రామారావులు. ధనవంతులైన రంగారావు కాత్యాయనిల కుమార్తె అనిత సహాధ్యాయిని అయిన మాధవితో స్నేహం ప్రారంభిస్తుంది.

"ఏంటి? నీ పరీక్షలప్పుడు మీ అమ్మగారు ఇంట్లో లేరా? మరి నిన్నెవరు నిద్రలేపేవారు తెల్లవారు ఝామున. నీ డౌట్స్ ఎవరు క్లియర్ చేశారు. నీకు అన్నమో... !" ఆశ్చర్యపోతూ అడిగింది మాధవి.

"ఎవ్వరూ లేపరు. అయినా, డాడీ పొద్దుపోయి ఇంటికొస్తారు కదా క్లబ్‌నించి. నేను స్కూలు కెళ్లేటప్పటికి నిద్ర లేస్తారు. నేను ఎప్పుడు మెలకువ వస్తే అప్పుడులేస్తాను..."

"మరి వంటా...అది"

"మా నాయరున్నాడుగా వంటకి. పనిపిల్ల వుందిగా మా బాబ్జీని చూసుకోడానికి" నీళ్లు గట గటా తాగేస్తూ గబ గబా మాట్లాడేస్తున్న అనితను వింతగా చూచింది మాధవి. ఆ పిల్ల కెందుకో చాలా అసంతృప్తిగా వుంది. ఏదిటో బాధగా కూడా అన్పించింది. కాని అది మాటల్లోఎలా వ్యక్తం చేయాలో తెలియలేదు.

"థాంక్యూ ఆంటీ—పువ్వులకీ, అరిసెలకీ— అదే కదూ మాధవీ దాని పేరు" మాధవి భుజం మీద చెయ్యి వేసుకొని బయటకి నడుస్తూ సుగుణవేపుచూస్తూ అంది అనిత. సరిగ్గా మూడింటికి తిరిగి వచ్చేస్తానని అమ్మతో చెప్పి, తనతో వచ్చేస్తానంటూ మారాం చేస్తున్న బుజ్జిగాణ్ణి బలవంతంగా అమ్మకి అప్పచెప్పి, అనితవెంట బయలుదేరింది మాధవి.

## 6

పెద్ద కాంపౌండులో చక్కటి తోట మధ్య హుందాగా నిల్చున్న ఆకుపచ్చనిబంగ్లాముందు, రివ్వున వచ్చి ఆగింది అనితా వాళ్ల జీపు. అనితా వాళ్ల తోటని చూస్తూ ఒక్కమారు విస్తుపోయిందిమాధవి. చాలా నీటుగా,అందంగ, క్రమబద్ధంగ పెంచబడ్డ క్రోటన్లతో,చిన్నచిన్ని పర్ణశాలలను మరపింపచేస్తూ అక్కడక్కడ రీపర్స్‌కి అల్లించిన క్రీపర్లతో, ఆకాశానికి అంటుతోన్న అశోక వృక్షాలతో ఎంతో గ్రాండ్‌గా వుందా తోట. మాధవి, లతలకేసి చూస్తూ మురిసిపోతూ నిల్చుంది.

"కమాన్ మాధవీ! మా డాడీ ఇంకా రాలేదు." డ్రాయింగ్ రూములోకి లాక్కుపోతూ అంది అనిత. డ్రాయింగ్ రూము అలంకరణ మాధవికి మరీ క్రొత్తగా, తను చూచిన సినిమా సెట్టింగులా అన్పించింది. ఎర్రటి బీజ్ కార్పెట్‌మీద ఖరీదైన సోఫా సెట్టు, నాల్గు మూలలా అందమైన కార్నర్ టీపాయిల మీద మోడరన్ ఫ్లవర్ వేజెస్,

గోడలకి అక్కడక్కడ వున్న ప్రొజెక్షన్స్ మీద ఖరీదైన క్యూరియోస్, ఇన్ సెట్ ఫిష్ పాండ్ మీద ఓ డాన్సింగ్ డాల్ — అన్నీ చూస్తూ నిల్చుంది మాధవి. గాలి వీచినపుడల్లా వూగుతూ నృత్య భంగిమలను చూపుతున్న ఆ అందాల బొమ్మను ముట్టుకోవాలని పించింది మాధవికి. "ఛీ ... అయినా అదేం సభ్యత ... " అనుకుంటూన్న మాధవి, "ఓ మాధవీ ... లోపలికి రావమ్మా తల్లీ!" అంటూ అనిత వేసిన కేకకి వులిక్కిపడి నెమ్మదిగా లోపలికి నడిచింది.

డ్రాయింగ్ రూము నుండి, కుడివేపుకు వెళ్తే వచ్చేదే డైనింగ్ రూము. అక్కడే పెద్ద డైనింగ్ టేబిల్—దాని దగ్గర అనిత నిల్చుని, "నాయర్ ... టిఫిన్ ... నాకూ మాధవికి," అంటూ వంటవాడికి ఆర్డర్ పడేసింది.

"నో—ప్లీజ్. ఇప్పుడేగా టిఫిన్ తినివచ్చాం. కావాలంటే నువ్ తీసుకో..."

"నాకు మాత్రం ఎందుకూ ...! నాయర్ నో టిఫిన్" అంటూ, ఫ్రిజిడైర్ దగ్గరికి పరుగునవెళ్లి, డోర్ లాగి రెండు కోకాకోలా బాటిల్స్ బయటకు తీసింది.

స్ట్రాతో ద్రవాన్ని జుర్రుతున్న అనిత, "మాధవీ, మా డాడీ నేను ఈవెనింగ్ పిక్నిక్కి వెళ్తున్నాం. నువ్వూ వస్తావా ? " అంది.

"సారీ అనూ ! మా ఇంట్లో చెప్పలేదుగా. అయినా మా అమ్మగారు ఎన్నాళ్లనుండో 'శారద' సినిమా కెళ్లాలని అంటున్నారు. నా పరీక్షలని ఆగిపోయారు. మాబుజ్జిని నే పట్టుకుంటే మా అమ్మగారు సినిమా కెళ్తారు." ఖాళీ చేసిన బాటిల్ ని, టేబిల్ మీద పెడ్తూ అంది మాధవి.

"అల్లాగా ! పోన్లే, నా రూముకొస్తావా—నా డాల్స్ అవీ చూపుతాను"మాధవిని తన గదికి తీసుకెళుతూ అంది, అనిత.

అనిత గదిలో రెండు బేబీ కాట్స్ వేసి వున్నాయ్. వాటికి మస్కిటో కర్టన్లు. గదికి మూలగ ఒక గాడ్రేజ్ బీరువా. పక్కనే వున్న కోట్ స్టాండ్ నిండా అనిత ఫ్రాక్స్,స్కర్టులు, బ్లౌజులు.

కుర్చీ లాగి, "మాధవీ ! కూచో"మాధవికి కుర్చీ ఆఫర్ చేసి తను మంచంమీదకూచుంది అనిత. కార్నర్ సెమీ సర్క్యులర్ టేబిల్ మీద రకరకాల బొమ్మలు. అందులోంచి ఒక బొమ్మను లాగి, ఇదే నాఫేవరిట్ డాల్మాధవీ! నా ఫిఫ్త్ బర్త్ డేకి మా డాడీ ఇచ్చారు. రోజా ఇది నా పక్కలోనే పడుకొని నిద్ర పోతుంది. చిన్నప్పుడు ఎంచక్కా పడుకోపెట్టుకోగానే కళ్లు మూసేది. కానీ ఇప్పుడో—అలా కళ్లు తెరుచుకొనే చూస్తూ వుంటుంది" చక్రాల్లాంటి తన కళ్లను అటూ ఇటూ తిప్పుతూ అంది, అనిత.

"అబ్బ నిజంగానే...!"

"ఇదో...ఈ బుల్లిబుల్లి రాబిట్స్ చూశావా? ఈ జెపానీస్ ట్రంపెటర్స్ని చూడు—ఇది బార్బర్... సిజర్స్ ఆడిస్తూ జడిపిస్తాడు; ఐడోంట్ లైక్ హిమ్. ఈ ముందు వెనుకలకు వూగే హిమాలయన్ బేర్స్ ముద్దొస్తుంది కదూ. ఇదో... ఈ టాయ్ ట్రెయిన్ మా బాబ్జీది. ఈ మధ్యనే ఆక్సిడెంట్లో ఇన్వాల్వయి తుక్కు తుక్కయింది. ఈ ఆస్ట్రొనాట్ని చూశావా. పాపం కీ యిచ్చి వదిలామా రూఫ్ వరకూ ఎగిరి టఫీమని కింద పడ్తాడు..." సరదాగా చెప్పుకుపోతున్న అనిత కేసి, అనిత చూపిస్తున్న బొమ్మలకేసి ఆశ్చర్యంగచూస్తూ వుండిపోయింది, మాధవి. ఎంత బావున్నాయ్ అనితా నీ డాల్స్. వీటినన్నిటినీ చూస్తుంటే ఇక్కడే వుండిపోదామాఅనివుంది."

"ఓ. యస్. అల్లాగే వుండిపో. హాయిగా






ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ బొమ్మలతో ఆడుకుంటూ వుందాం!"

"అమ్మో! మా అమ్మని వదిలి నేనొక్క రోజుకూడా వుండలేను. మా అమ్మా అంతే. నన్నొదిలి వుండగలదా?" కళ్ళు గర్వంగా తిప్పుతూ అంటున్న మాధవికేసి చూచింది అనిత.

అనితా వాళ్ళ డాడీ వచ్చేవరకు బొమ్మలతో ఆడుకుంటూ గడిపేశారు, అనితా మాధవి. రంగారావుగారి బలవంతం మీద మాధవి మధ్యాహ్న భోజనం అనితా వాళ్ళింట్లోనే చేసింది. మూడుగంటలకు ఆఫీసుకెళుతూ మాధవిని వాళ్ళింట్లో డ్రాప్‌చేసి, మరీ వెళ్లాడు రంగారావు.

## 7

సెలవుల్లో అనిత, వాళ్ళ బాబాయిగారి వూరైన బాంబే చెక్కేసింది. మాధవికి ఇంట్లోనే వుండడం కొంచెం బోర్ అన్పించినా అమ్మతోబాటు తోటపని చేస్తూ, బుజ్జి గాడికి చిన్నచిన్న పద్యాలు నేర్పిస్తూ, నాన్నగారు తెచ్చిచ్చే చిన్నచిన్న కామిక్ పుస్తకాలు చదువుతూ గడిపేసింది. తీరా రిజల్ట్సు తెలిసే రోజున మళ్ళీ మొదలు – పిల్లల హడావిడి, కంగారు, భయమూ.

స్కూలుకే వస్తాయి రిజల్ట్సు. కాబట్టి అందరూ పొద్దుటే చేరిపోయారు బడిచెంత. సాధారణంగా ఎవరోగాని సెవంత్ క్లాసులో తప్పరు. అయినా ఎందుకో అందరికీ భయమే! అందులో క్లాసులో ఫస్టువచ్చే మాధవి కెందుకో భయం? ఆపిల్ల భయం భయంగానే వచ్చింది. బహుశా తనకి ఫస్టురాంక్ రాదన్న భయమా? ఎవరో లిస్టు చూసివచ్చి, "మాధవీ నీకేనోయ్ ఫస్ట్‌రాంక్ మనస్కూల్లో. సుమతి సెకండొచ్చింది" అన్నారు.

మాధవి వార్తందించిన అమ్మాయికి థాంక్స్ చెప్పి ఇంటికేసి పరుగెత్తింది. అనితకి వెంటనే పుత్తరం వ్రాసేసింది. "ఇద్దరం పాసయ్యాము. నువ్వు వెంటనే వచ్చేయ్" అంటూ. మాధవి తలిదండ్రుల ఆనందం వర్ణనాతీతం. కానీ, వారి ఆనందం అవధులు దాటి పొర్లి ప్రవహించింది ఆరోజుకాదు. మాధవి జిల్లాకే ఫస్ట్ వచ్చిందంటూ డి. ఈ. ఓ తెలియపరుస్తూ, క్యాష్ ప్రయిజ్ రెండు వందల రూపాయలను అందించిన ఆ మూడో రోజు. రెండునందల రూపాయలు పెట్టి మంచి ఇంగ్లీషు-తెలుగు డిక్షనరీలు, చక్కటి పెన్ను, మంచి మంచి జనరల్ నాలెడ్జి బుక్కులు ఎన్నింటినో కూతురు మాధవికి కొనితెచ్చాడు. రామారావ్–సుగుణ కూతుర్ని తీసుకొని దేవాలయానికి వెళ్లి మాధవి పేర అర్చన చేయించింది.

## ఇద్దరమ్మాయిల కథ

కాలెండర్‌లోని మే నెల కాగితాన్ని చింపుతున్న మాధవి "అమ్మా! ఎల్లుండే మా బడి; ఊర్లకెళ్ళిన సరోజా, జానకి, శాంతి వచ్చేశారు. అనితే ఇంకా రాలేదు. అయినా అనితేం చేస్తోందో ఇన్ని దినాలు బొంబాయిలో...!" బుజ్జిగాడికి బట్టలేస్తున్న సుగుణతో అంది.

"ఇంకా రెండు రోజులుందిగా! ఇంతలో రాదా ఏవిటి..." నోటిలోని మాట నోట్లో వుండగానే ఎదురుగా వస్తున్న అనితను చూసి ఆశ్చర్యపడి పోయింది సుగుణ.

"ఏయ్ అనితా! నువ్వా! నూరేండ్లు నీకు, నిన్ను గురించి ఇప్పుడే అమ్మతో చెపుతున్నాను. ఎప్పుడొచ్చావ్...ఎలావచ్చావ్...?"

"దిస్ మార్నింగ్. హైదరాబాద్ నుండి సరాసరి మీ యింటికే వద్దామనుకున్నాను. ఎందుకో తెలుసా!"

## ఇంటింటి చిట్కాలు

1. కరక్కాయ చిన్నముక్క బుగ్గన పెట్టుకుని, వగరులాంటి రసంని మింగితే పూపిరాడక బాధించే దగ్గు నివారించవచ్చును.

2. లవంగాలు కాల్చిపొడిచేసి రోజూ ఉదయం పూట 1 స్పూను తేనెలో చిటికెడు లవంగపొడి వేసి కలిపిపుచ్చుకున్న నసదగ్గు నివారించవచ్చును.

3. ఏలకులపొడి మెత్తగాచేసి పాలస్పైన విగాడతో బాగా ఈ పొడివేసి కలిపి పేస్టులా తయారు అయిన తరువాత నోటిపూతతో బాధపడేవారు నోటికిరాస్తే గ్లిజరిన్ కన్నా బాగా త్వరగా పని చేస్తుంది. నోటికి సువాసనగా కూడా వుంటుంది.

4. గులాబిపూవులు నిల్వవుండాలని, తాజాగా వుండాలని కోరుకుంటారు. గులాబిపూవుమీద (పుప్పొడి వుండేచోటున్న చోట) రెండు చుక్కలు కొబ్బరి నూనెబొట్లు వేస్తే రేకులు వ్రాడకుండా పూవు రెండు రోజులు తాజాగా వుంటుంది.

5. కారం (ఎండు మిర్చి పొడి) పురుగు పట్టకుండా, ముక్కపట్టకుండా వుండాలంటే మెత్తని వుప్పు కలిపి శుభ్రమైన సీసాలో నిల్వవుంచవచ్చును.

6. బియ్యంలో పురుగు పట్టకుండా, వుండాలంటే ఎండిన వేపఆకులు కొద్దిగా బియ్యం డబ్బులోవేసి పైన కాగితంవేసి బియ్యం పోసిన జాగ్రత్తగా వుంటాయి.

7. పైనవు కాగితాల సంచులలో ఆకుకూరలు, కరివేపాకు తాజాగావుంచవచ్చును.

8. పెరుగుపుడకకపోతే చిటికెడు పసుపు, రెండు చుక్కలు మంచినూనెవేసిన త్వరగా పుడుకుతుంది.




"ఏమో !"

"లేకుంటే–నువ్వూనేను కలిసి కంబైన్డ్ స్టడీచేసి పరీక్షలు రాసేవాంకదా! నీకేమో ఫస్టు రాంక్ నాకు సెవెంతూనా. !

"ఓ‌హో . అదా ఏదో అనుకున్నాను" నవ్వుతూ అంది మాధవి

"ఇట్సాల్ రైట్ . తర్వాత కలుద్దాం . నేను ప్లేన్లో వస్తున్నానని నీకు జాబు రాసి వుంటే ఏర్‌పోర్టుకి వచ్చేదానివేమో కదూ! ఎటూ నన్ని వూరు తీసుకొచ్చేందుకు డాడీ వెహికల్ కూడా పంపేరాయె బాగున్నావ్ కదూ బజారెళుతూ– జస్ట్– ఎలా వున్నావో పల్కరించి వెళదామని వచ్చాను వస్తానూ . బై "

"బై.." అంటూ జీపులో వెళుతున్న అనితకేసి చూస్తూ, చేతులూపుతూవాళ్లింటి బయట నిల్చింది మాధవి

## 8

నిన్నకి ఉద్వాసన పల్కిన నేడు, సరిక్రొత్త సొగసులను, అందాల మార్పు చేర్పులను సంతరించుకొని త్రుళ్లింత లిడుతోంది గంట కొట్టీ కొట్టగానే ఎనిమిదవ తరగతిలోంచి విరిబాలలు బయటకు దూసుక వచ్చారు

"ఓ చదువుల సరస్వతీ క్విక్ రావమ్మా త్వరగా . "మాధవి వంక విసుగ్గా చూస్తూ అంది అనిత

"సారీ అనూ నేనివ్వాళ నుండి హిందీ స్పెషల్ క్లాసుకి వెళుతున్నాను. మరివాను, నువ్వూ కట్టరాదూ హిందీపరీక్షకి"

"హిందీ పరీక్ష ..! ఇంకేం పరీక్షలు మిగల్లేదా? పోవోయ్ మాధవీ సాయంకాలాలు హాయిగా క్లబ్బులో షటిల్, టేబిల్ టెన్నిస్ నేర్చుకోక ఎందుకొచ్చిన పరీక్షలు చెప్పు"

"అదికాదు అనితా. మీ నాన్నగారంటె క్లబ్ మెంబరు "

"నీకెన్నిమార్లు చెప్పాను మధూ, నా గెస్ట్‌గా వచ్చి ఆడమని అయినా, నీ కిష్టం లేదని చెప్పరాదు"

కోపంగా నడిచిపోతున్న అనితను చూస్తూ నిల్చుండి పోయింది మాధవి "అనితకు కోపం వచ్చింది కానీ నేనేం చేయను అనితలాగ తిరగడం నావల్ల సాధ్యమయ్యే పనా?"మాధవి హిందీ క్లాసుకేసి నడిచింది

మాధవి మనస్సు ఆటల మీదికన్నా చదువుపట్ల మళ్లడం వల్లనేమో అనితకి మాధవిని చూస్తే కాస్త మత్సరం, విసుగు కల్గజొచ్చాయ్ అనిత చెప్పే లియ్యతియ్యటి కబుర్లకి చాలామంది పిల్లలే అనిత చుట్టూ చేరసాగారు.

"వ్వాట్ ? అనితా, మాధవితో అంత క్లోస్గా వుంటావ్. ఆ అమ్మాయిని చూసయినా చదువులో కాస్త ఇంటరెస్ట్ తెచ్చుకోరాదు" అంటూ, ఒకరిద్దరు టీచర్లు అనడంతో అనితకి మరీ వుక్రోషం, వుడుకుమోత్తనం వచ్చేది.

పేరెంట్స్ డే కి కాన్వెంటు పిల్లలు చాలా అయిటమ్స్ ఇచ్చారు అందులో ముఖ్యంగా పిన్నాపెద్దల నందర్నీ ఆకర్షించింది 'మర్చంటాఫ్ వెన్నీస్' అన్న గేయనాటిక. అందులో 'పోర్షియో'గా అనిత, 'బసానియో'గా మాధవి నటించారు పిల్లలిద్దరూ పోటీపడి చక్కగా నటించారు కాని, ఆఖరికి మొదటి బహుమతి 'బసానియో' పాత్రధారిణి మాధవికి వచ్చింది. కన్సొలేషన్ బహుమతి సందుకొన్న అనిత కళ్లనిండా నీళ్లు తన నటన చూసిన డాడీ మమ్మీలు– "షూర్, నీతా ! నీదే ఫస్ట్ ప్రయిజ్. డార్లింగ్ సుపర్బ్‌గా యాక్ట్‌చేశావ్" అంటూ మెచ్చుకున్నారు కానీ స్కూలు అధికారులు మాధవి కిచ్చారు మొదటి బహుమతి

తనకిచ్చిన బహుమతిని ఫ్రెండ్స్‌కి చూపుతూ, దగ్గరికొచ్చిన మాధవిని చూచీ చూడనట్లు ముందుకు నడిచింది అనిత. విస్తుపోయి నిలబడ్డ మాధవి ముఖం చిన్నబోయింది

అసలే కోపంగా వున్న అనిత చుట్టూ చేరారు అనిత వాక్‌లెస్ ఫ్రెండ్స్

(ఇంకా వుంది)

### కుంకుమ

పావు కెజి వంటపసుపుకొమ్ములకు 50పైసలు కుంకుమ రాళ్ళు వేసిన సరిపోతుంది బాగా రంగును కావాలనుకున్నవారు మరికొన్ని రంగు రాళ్ళు వేయవచ్చును

తయారుచేయు విధానం —పసుపుకొమ్ములలో రంగురాళ్ళువేసి బాగా దంచాలి కొద్దిగా 1 టీస్పూను కొబ్బరినూనె వేయాలి మెత్తగా దంచి మెత్తని జల్లెడతోగాని, లేక వస్త్రకాళంపట్టినా బాగుంటుంది చాలా రోజులు నిల్వవుంటుంది బాగా మాగిన కొద్దీ రంగు వస్తుంది అనేకమైన రంగులలో కుంకుమరాళ్లు దొరుకును మనం తయారుచేసిన కుంకుమ వాడిన నుదుట మచ్చలు పడవు

శ్రీమతి సీతాలక్ష్మిరాజ్

ముహూర్తం వేళ అయింది.

"వాయించండ్రా గట్టిగా" అన్న పురోహితుని గొంతువిని అప్పటివరకూ 'మా మహాలక్ష్మి పెండ్లి కూతురాయెనే' అని నింపాదిగా వాయిస్తున్న సన్నాయి "మై క్యాకరూం రామ్ ముఝె బుడ్డా మిల్ గయా" అని తారస్థాయిని అందుకున్నాది ...

పెండ్లి పందిర మహా సందడిగా వుంది. మంగళసూత్రధారణ జరిగిపోయింది.

"బావగారూ, దయచేసి పుస్తె కడుతున్న ఫోజులో మళ్లీ ఒక్క సెకెండ్ నిల్చోండి ఒక్క షాట్ తీసేస్తా" నని బ్రతిమలాడుతున్నాడు పెండ్లికొడుకుని ఓ కెమేరా బావమ అది, అసలు సైంకి అడ్డు వచ్చిన పురోహితుని గుండుని మనస్సులో తిట్టుకుంటూ. ఇలా ఎవరిసందట్లో వాళ్లు వుండగా, 'సడేమియా'లా రెండు జతల కళ్లు (అందులో ఒక జత ఆడ కళ్లు మరో జత మగ కళ్లు) ఒకటిగా కల్సుకొని, మళ్లీ విడిపోతున్నాయి.

యువకులకే
మా యువకులకే
స్వతంత్రం వస్తే
యువతులకే
మా యువతులకే
స్వారాజ్యం వస్తే
నాలుగు కళ్లని రెండుగ చేస్తాం
రెండు గుండెలని ఒకటిగ చేస్తాం
యువకులకే
మా యువతులకే

అని సినిమాలో అయితే పాడుతూ వాళ్ళిద్దరూ గెంతేవారనుకోండి. కానీ ఇది కథ కనుక ఆ పాటని బ్రేకెట్ లో వదిలేద్దాం.

'మన కథకి హీరో హీరోయిన్లు బుక్ అయారు' అనుకున్నాడు (మనస్సులో) ఆ పెళ్లికి వచ్చిన ఒక రచయిత.

ఆడజత కళ్లు మగజత కళ్లనీ, మగజత కళ్లు ఆడజత కళ్లనీ వెతుక్కుంటూ "కళ్ల టాక్" చేసుకుంటూ ఉంటే, ఆడ + మగ జత కళ్లనీ, వాళ్ళ 'కళ్ల టాక్' నీ అతి శ్రద్ధగా ఫాలో అవుతూ, తను రాయబోయే కథకి ప్లాటుకోసం పాట్లు పడుతున్నాడు రచయిత.



ఇంతలో ఫలహార నిమిత్తం మగ పెళ్ళి వారికి పిలుపు వచ్చింది. అందరితో పాటు ఆరిందాలా ఆడ జతకళ్లు కూడా విస్తరి ముందు కూర్చొని మగజత కళ్లు కహాఁహై ? అని ఆరాతీయ సాగాయి. అది గమనించిన మగజత కళ్లు "గోల్డెన్ ఛాన్స్" అనుకుని వడ్డనకి పూనుకున్నాడు.

ఇక్కడ ఒక ముఖ్య గమనిక : 'అతను' మగవాడయినా ఆడపెళ్లివారి తాలూకు అనీ 'ఆమె' ఆడదయినా మొగ పెళ్లివారి తాలుకు అని పై సంఘటన ద్వారా రచయితకి తెల్సిపోయింది.

అతను ఆమెకి తనకన్నా ముందుగా ఎవరైనా వడ్డించేస్తారేమోనన్న తొందరలో ఉప్మా, ప్మా, ప్మా, ప్మా ... అంటూ గబగబ ఆమె విస్తరివైపు వెళ్లబోతూవుండగా, ఒక ఉప్మా ప్రియుడు అది సహించలేక "ఇదిగో లబ్బాయ్, ప్మా, ప్మా, ప్మా, అంటూ మెయిన్ రోడ్డు మీదపోయే మోటారు కారులాగ పోతే ఎలా ? నలుగురికి చూసి వడ్డించాలి" అని తన వేళ్లకి అంటుకుని వున్న ఉప్మా పిసిర్లని

నాక్కోసాగాడు. అతను పాపం తన కారు (ళ్ల)కు సడన్ (బేక్ వేయక తప్పిందికాదు. ఈలోపున ఒక 'పుడక'గాడు 'ఆమె'కి వడ్డించేసాడు! "డామిట్ కథ అడ్డంతిరిగింది" అనుకుని డిసపాయింట్ అయిన అతను "బెటర్ లక్ లంచ్ ప్రైజ్" అనే పెళ్ళి(గాం లాంటి చూపుని ఆమె కళ్లల్లో చదువుకుని కాస్త తృప్తిపడ్డాడు.

'కథ పట్టులో పడింది, వీళ్లని వంటరిగా వదలకుండా ఫాలో అవాలి' అనుకుంటూ చెయ్యి కడుక్కున్నాడు రచయిత.

లంచ్‌కి లేట్‌గా వచ్చిన ఆమెకి విస్తర్లు ఖాళీగా ఎక్కడా కన్పించలేదు. అది గమనించిన తుకారాం (పెండ్లికొడుకు) తన (పక్కనే మరొక విస్తరి స్పెషల్‌గా తెప్పించి వేయించి మరీ కూర్చోపెట్టించుకున్నాడు ఆమెని తన (పక్కని.

అది గమనించిన అతను "ఔరా ఈమెనాదే నన్నమాట—సారీ, ఐమీన్, ఈమె నా స్నేహితుడు తుకారం తాలుకే నన్నమాట" అని అనుకొని, పని వున్నట్లుగా తుకారంవేపు మంచినీళ్లు, గ్లాసులు పట్టుకుని వెళ్లాడు.

"ఒరేర్ లడ్డూ యిలారా" తుకారం పిలుపు విని అతను ఆగాడు "ముందు ఒక గ్లాసుతో మంచినీళ్ల ఈ స్పెషల్ విస్తరి ముందు పెట్టు. అన్నట్లు ఒరే లెట్‌మీ యిం(ట్రడ్యూస్ మై మరదలు — ఈమె నా మరదలు. పేరు లవ్"అని ఆమెని అతనికి పరిచయం చేసాడు.

"పోదూ బావా ఆఖరికి నీ పెళ్లిలో నీ పెళ్లాం స్నేహితుల ముందు కూడ నన్ను ఎగతాళి చేస్తావా నన్ను" అని చిరుకోపం కనపర్చింది ఆమె.

"ఎగతాళికేముందీ — నీ పేరు తాలుకు (ట్రూ(ట్రాన్స్‌లేషన్ చెప్పాను" అన్నాడు పెళ్లికొడుకైన తుకారాం.

ఇదేమీ అర్ధంకాక, తికమక పడుతున్నాడు అతను.

"ఒరే అలా తెల్లమొహం వేయకు — లవ్ అన్న పేరు ఈమెకి ఎలా వచ్చిందో చెప్తా విను" అంటూన్న తుకారాం మాటని తుంచేస్తూ ఆమె "పోదూ నువ్వు ఎప్పుడూ యింతే. తెలిసీ తెలిని వయస్సులో జరిగిన దానిని పట్టుకొని జీవితాంతం ఆఖరికి పరాయి మొగవాని ముందు కూడ నన్ను పరాభవం చేస్తున్నావు - నాకేం సిగ్గా, నా కథని నేనే చెప్తా వినండి" అంటూ ఆమె చెప్పటం మొదలు పెట్టింది.

"నేను ఇంగ్లీషు నేర్చుకున్న కొత్తల్లో ఒకనాడు మా టీచరు తను ఇంగ్లీషులో అడిగే (ప్రశ్నలకి జవాబులు ఇంగ్లీషులోనే యివ్వాలి అన్నారు. అంతా అలాగే అన్నాము.

"వాటీజ్ యువర్ నేమ్?" అని మా టీచరు నన్ను (ప్రశ్నించారు. "మై నేమీజ్ లవ్" అని తడుముకోకుండా రకీమని నేను జవాబు చెప్పాను. క్లాసంతా ఒకటే నవ్వు.

"మరి (పేమ అంటే ఇంగ్లీషులో లవ్ కాదాండి?" అని నేను టీచరుగారినే (ప్రశ్నించాను. దాంతో క్లాసులోని పిల్లలు మరీ జోరుగా నవ్వటం మొదలు పెట్టారు.

నా సందేహాన్ని యింటికి వచ్చాకా మా బావతో చెప్పాను. "నీమొఖం! పేర్లకి ఇంగ్లీషు తెలుగు వుండదు. మీ అక్కపేరు పద్మ కదా కొంపతీసి మీ అక్కని "లోటస్" అంటావా ఇంగ్లీషులో? అంటూ నన్ను ఆ రోజు నించీ "లవ్"అని పిలవటం మొదలు పెట్టాడు." అని ఆమె ముగించింది తన పేరు తాలుకు స్టోరీని.

అతను నవ్వు వచ్చినదానికన్నా ఎక్కువగా నవ్వాడు. నవ్వుతున్నప్పుడు అతను మరీ బాగున్నాడు చందమామలాగ అనుకుంది ఆమె మనస్సులో.

ఈలోగా తుకారాం ఆమెకి అతన్ని పరిచయం చేయటం మొదలు పెట్టాడు. "వీడు నా (ఫెండు. పేరు లవుడు. వీళ్ల అమ్మగారికి కవలపిల్లలు పుడితే లవ-కుశ అని పేర్లు పెట్టుకున్నారట. కుశగాడి కుశలం ఆదిలోనే కిక్ చేసిందట బక్కెట్‌ని. వీళ్ళ అమ్మగారు లవుడుని అప్పటి నించి అతి జాగ్రత్తగా వెన్న మీగడలు పెట్టి తుమ్మినా, దగ్గినా డాక్టర్‌కి చూపిస్తూ టానిక్కులు పట్టి పట్టి వీడిని యిలా లడ్డూలా తయారు చేసారు వీడిని నేను ఒరే లడ్డూ అంటే వీడు వుడుక్కోకుండా స్పోర్టివ్‌గా నా పేరులోని మొదటి అక్షరాన్ని మింగేసి నన్ను (తు) 'కారం' అనిపిలుస్తాడు. మేము ఇద్దరము కాలేజీలో చదువుకునే రోజులలో కల్సి వెళ్తూవుంటే అమ్మాయిలు "స్వీట్ హాట్" అని అరిచేవారు. కొత్తలో అమ్మాయిలంతా "స్వీట్‌షాట్" అంటున్నారు అంత అందగాడినా, అంత అదృష్టమా అని నాకు నేను, వాడికి వాడు సెపరేట్‌గా ఎన్నో తియ్యటి కలలు కన్నాం. కానీ తరువాత తెల్సిన చేదునిజం ఏమిటంటే—

లడ్డూ తియ్యగా ఉండును కాబట్టి
లడ్డూ—స్వీట్—లవుడు.
కారం—కారముగా వుండును కాబట్టి
కారం—హాట్—తుకారాం.

మేమద్దరం ఎప్పుడూ కలిసి వుంటాం కాబట్టి స్వీట్ + హాట్ — స్వీట్ హాట్ అని అరిచేవారట. తరువాత కొన్నాళ్లకి మాకు మన్మధరావు అనే అబ్బాయితో స్నేహం అయి మేము ముగ్గురం కలిసి తిరిగేవాళ్లం. మన్మధరావు కారు నలుపు. అందుకని ఎప్పుడూ తెల్లటి పేంటు తెల్లటి షర్టు వేసుకునేవాడు. అమ్మాయిలంతా వాడిని 'కాఫీ' అని ఏడిపించేవారు. తెల్లటి పింగాణీ కప్పులో పోసిన నల్లటి కాఫీ- మన్మధరావు అని తెల్సింది. ఈ గుట్లన్నీ ఎవరుచెప్పారో తెల్సునా యిదుగో మా ఎదురింటి పిల్ల అని తుకారాం పెళ్లికూతురిని చూపించాడు. "గుట్టు చెప్పిందని లవ్వాడి పెళ్లాడుతున్నావన్నమాట" అని అంటించింది ఆమె.

ఇలా జరిగిన పరిచయాన్ని (శమపడి ఎడ్రస్‌లు అడగటం వరకూ వినియోగించుకొని మరీ విడిపోయారు అతడూ — ఆమెలు, సారీ, లవుడూ—లవ్‌లు. కొంతకాలం వారిరువురి మధ్యా ఉత్తర (ప్రత్యుత్తరాలు జరిగిన పిమ్మట హరాత్తుగా లవుడికి "అలస్యం అమృతం విషం" అని గుర్తుకి వచ్చి తను ఆమెని లవ్ చేస్తున్నట్లు వెంటనే తెలియ

(44 వ పేజీ చూడండి)

## అందాన్ని చూచి....

— వనం రాంమోహన్‌రావ్

అందరాని మావికొమ్మ
అందాన్ని సృష్టించె
అంతులేని ఈ జగతికి
ఆవేశం పట్టించె
కూతరాని కోయిలమ్మ
కూసి ది కొత్తగా
(బతుకలేని ముసలమ్మ
మూల్గింది బాధగా)
బాధలేని కోయిలమ్మ
కూసింది బరువుగా)
పలుకలేని పసిపాప
నవ్వింది పకపకా

# ధర్మపథం - కాయికసేవ

కాయమంటే శరీరం. తన శరీరావయవములతో భగవంతుణ్ణి సేవించుట కాయిక సేవ అనబడును. ఆ అవయవాలు – నాలుక, మనస్సు, చేతులు, చెవులు, కన్నులు, పాదాలు, ముక్కు, తల అనేవి నాలుకతో దేవుని స్తుతించుట, మనస్సుతో అతనిని ధ్యానించడం, చేతులతో దేవుని పూజించడం, చెవులతో ఆయన కథలు వినడం, కనులతో ఆయనను చూచుట, కాళ్లతో ఆయన ఉండే ఆలయానికి పోవడం, ముక్కుతో ఆయన పాదములపై నున్న తులసిని వాసన చూచుట, తలతో నమస్కరించుట ఆ సేవలు! ఈ విధంగా భక్తుడు దివ్యావయవాలను భగవంతుని సేవలో వినియోగిస్తే, ఆయన అనుగ్రహాన్ని పొందవచ్చును.

ఈ ఎనిమిది విధాలైన సేవలను గురించి పన్నిద్దరాళ్వార్లలో ఒకరైన కులశేఖరాళ్వార్లు తను 'ముకుందమాల'లో ఇలా చెప్పారు —

'జిహ్వే కీర్తయ కేశవం, మురరిపుం
చేతో భజ, శ్రీధరం
పాణి ద్వంద్వ సమర్చ, యాచ్యుత కథాం
శ్రోత్రద్వయ త్వం శృణు,
కృష్ణం లోకయ లోచనద్వయ, హరేః
గచ్ఛాంఘ్రి యుగ్మాలయం,
జిఘ్ర ఘ్రాణ ముకుంద పాద తులసీం,
మూర్ధ న్నమా ధోక్షజం'

'ఓ నాలుకా! కేశవునే స్తుతించు, ఓ మనసా! నీవు మురాసురుడిని చంపిన విష్ణువునే ధ్యానించు, ఓ చేతుల్లారా! మీరు అచ్యుతుణ్ణే పూజించండి, ఓ చెవులారా! మీరు విష్ణుదేవుని కథలనే వినండి, ఓ కన్నులారా! శ్రీకృష్ణుణ్ణే చూడండి, ఓ పాదముల్లారా! మీరు భగవంతుని దేవాలయానికే నడిచి వెళ్లండి, ఓ నాసికా! నీవు ముకుందుని పాదాలపై ఉండే తులసీ దళాన్నే వాసన చూడు, ఓ శిరస్సా! నీవు అధోక్షజునికే నమస్కారం చెయ్యి' అని దీని అభిప్రాయం. —బులుసు వేంకటరమణయ్య.

# వంకాయ శివంగి

— జి. స్వర్ణకుమారి.

లేతని గుండ్రటి చిన్న వంకాయలు పావు కె.జి.
ధనియాలు 1 స్పూను.
శనగపప్పు 1 స్పూను
మినప్పప్పు 1 స్పూను
ఎండు మిర్చి 6
పచ్చి మిర్చి 6
చిన్న అల్లం ముక్క
నీరుల్లి పాయలు 2
చింతపండు తగినంత
ఆవాలు, జీలకర్ర, మెంతులు కొద్దిగా
ఉప్పు తగినంత.
బెల్లం చిన్నముక్క.
పసుపు చిటికెడు
నూనె 4, 5 స్పూనులు.

వంకాయలు పుచ్చులు లేకుండా చూసుకుని, కాయ విడిపోకుండా నాలుగు పక్షాలుగా నీళ్ళలోకి తరుక్కోవాలి. కుంపటి మీద దళసరి స్టీలుగిన్నె పెట్టి, 2 స్పూనుల నూనెవేసి, 4 ఎండు మిరపకాయముక్కలు, ధనియాలు, శనగపప్పు, మినప్పప్పు, కొద్దిగా మెంతులు వేసి ఎర్రగా వేయించుకున్నాక, చిన్న స్టీలు పళ్ళెంలోకి తీసుకుని పావు కేజీ వంకాయలకు తగిన ఉప్పువేసి, రుబ్బురోటిలోవేసి మెత్తగా పొడుం కొట్టాలి. శనగపప్పు, మినప్పప్పు మెత్తగా నలిగేక, అల్లంముక్కకూడావేసి మెత్తగా కొట్టాలి. ఈ కొట్టిన పొడుంను, తరిగివుంచుకున్న వంకాయలలోగట్టిగాకూరి, స్టీలుగిన్నెలో కొద్దిగా నూనెవేసి, కారం కూరిన యీ కాయల్ని గిన్నెలో వేసి మూతపెట్టి కుంపటిమీద వుంచాలి. అప్పుడప్పుడు ఈ కాయలు విడిపోకుండా జాగ్రత్తగా గిన్నెలో కుదుపుతూ, కాయల్ని మగ్గించాలి. కాయ బాగా మగ్గేక (మెత్తగా అయేక) మనకి ఎంత పులుపుకావాలో చూసుకుని, కావలసిన చింతపండుని నీళ్ళలోవేసి, పిసికి యీ కాయలగిన్నెలోవేసి, ఈ పులుసుకి తగిన ఉప్పు, పసుపు పచ్చిమిరపకాయ ముక్కలు, ఉల్లిపాయ ముక్కలు, బెల్లంవేసి బాగా పులుసు మరగనివ్వాలి. దాంట్లో వుంటే కరివేపాకుగాని కొత్తిమెరగాని వేసుకుంటే ఇంకా ఘుమఘుమలాడుతుంది. పులుసుబాగా మరిగేక చిన్న గరిటెలో స్పూను నూనెవేసి రెండు ఎండుమిర్చి ముక్కలు, ఆవాలు, జీలకర్ర మెంతిగింజలువేసి పోపువేయించి పులుసులో కలపాలి కూర,పులుసు ఒకేసారి తయారవుతుంది.

క్షమించాలి! నాకొకర్ర చెప్పవుంది!

బాపు

# ప్రశ్నావళి

**కె. రామలక్ష్మి**

ఎస్ వి కె కొత్తగూడెం

మేము ప్రశ్నలు వేయడం మీరు జవాబు లివ్వడం మీకు వేరేయింకేం పని లేదా ?

ఇది పనికాదేమిటి ?!

డి ఎస్ ఆర్. కాకినాడ.

అసలు దేవుడనేవాడుంటే మనం అనుకున్న పనులు ఎందుకు జరగవు ?

బాగుంది మీరనుకున్నవన్నీ జరిగితేఇంకాని ఎక్కడుంది బాబూ,

పి పి కంభంపాడు

స్త్రీకి వివాహం అయితే పేరు మారుతుంది కదా మగవారే యింటిపేరు ఎందుకు మార్చు కోకూడదు

మన మహాభ్యకంత పరదాత్లేవు పద్మావతి పూర్వం శివుడుగారు పార్వతీపతిఅనీ, విష్ణువుగారు లక్ష్మీపతి అనీ, రాములవారు సీతాపతి అనిపించుకొని పెట్టుకున్నారు !!

వై ఎస్ ఆర్ రేపాం.

వివాహం పై మీ సదభిప్రాయం చెప్పకురు ?

వివాహ వ్యవస్థపై నాకు సదభిప్రాయమే కాదు, దురభిప్రాయాలు కూడా కలవు

ఆడది ఎప్పటికీనా బానిస అంటారు మీరేమంటారు ?

అక్కడి కెప్పుడూ మగవాడు బానిసకాడు !!

స్త్రీకి సమాజంలో వున్నవిలువ ఎట్టిది ?

అది నిర్ణయించే వాళ్ళ బుద్ధి వైశాల్యానికి నిదర్శన — కనుక మీలాంటి వాళ్లిస్తే —చెప్పు కుందుకు సిగ్గుపడేయునంటిదని ఇంకు చెప్పక తప్పదు

ఎం ఏ పి సుల్తానాబాద్

నేతి బీరకాయలో నెయ్యి ఎంతుందో కమ్యూనిజంలో నిజం అంతుందంటాను

శాస్త్రకారులు పరిశోధించి నేతిబీరకాయలోంచి నెయ్యినేనా తియ్యకలరుగాని కమ్యూనిజంలోంచి పార్టీ నియంతృత్వాన్ని తొలగించలేరు




పి ఎస్ ఎస్ ఆర్ విశాఖపట్నం.

మూడు సంవత్సరాల్ క్రితం మాకు పరిచయం అయింది ఈ మూడు సంవత్సరాలు ఒకరినొకరు చూడలేనిదే బ్రతకలేక పోయేవాళ్ళం కాని సడెన్‌గా మెస్నటి మించి మారిపోయింది . . యింకోరితో తిరుగు తోంది

ఒక్కొక్కప్పుడు మూడు సంవత్సరాలు కాదు ముప్పయి సంవత్సరాల ప్రేమేనా ముప్పయిసెకం డ్లలో మాయమైపోవచ్చు దాన్నే మనసు విరగడం అంటారు విరిగిన చెయ్యాకాలూ అతకవచ్చునే గాని విరిగిన మనస్సు అతకడం అసవసరం — అంతమాత్రం చేత—ఆమె మీద మీరు అభాం డాలు వేస్తూ మీ తేలిక బుద్ధులు బయట పెట్టుకోవడం అనవసరం. . మీతో తిరుగు తున్నంతకాలం ఆమె మంచిది —మీ స్నేహం వదలి వేస్తే —తక్షణం చెడ్డదెలా అయిపోతుంది ?!

జి ఎస్. పి శృంగవరపుకోట

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను ఆ అమ్మా యిని పెళ్ళిచేసుకోవాలనివుంది గాని మా తల్లి దండ్రులు ఒప్పుకోవడం లేదు. మీ సలహాఏమిటి ?

మీ చదువు పూర్తయిందా ? ఆర్థికంగా మీ కాళ్ళమీద మీరు నిలబడగలరా ? . అప్పుడే మీ యిష్టం వచ్చినట్లు యిష్టమైన అమ్మా యిని చేసుకునే ధైర్యం వుంటుంది

ఆర్ ఎస్ ఎస్ పి. బి సుళ్లూరుపేట

స్త్రీ స్త్రీని మెచ్చదు కారణం ?

లైక్‌పోల్స్ రిపెల్ అన్న శాస్త్ర సూత్రం విన లేదా తమ్ముడూ ?!

ఎస్. ఎస్ ఆర్ కర్నూలు

ఆడది తిరిగి చెడుతుంది మగవాడు తిరగ కుండా చెడతాడంటారు ఎంత వరకూ నిజం ?

అది ఆ కాలపు మాట ఈ నాడు—అడ్డమైన తిరుగుళ్ళు తిరిగితే—ఇద్దరూ చెడతారు !

ఎం వి ఆర్. బూరుగ్గడ్డ

స్త్రీ బుద్ధి ప్రళయాంతకం అంటారు ?

తెలియక ! స్త్రీ దృష్టి—ప్రణయాంతకం కదా ?

పూర్వం రచయితల విలువ ఎలాంటిది ! ఇప్పటి రచయితల విలువ ఎలాంటిది ?

పూర్వం రచన వారుపోక ! యిప్పుడు కాస్త ధర పలుకుతూంది !

విజయ్, నందిగామ

నవలా సాహిత్యాన్ని కమర్షియలైజు చేస్తున్నా రనే తీవ్రవేదన వ్యక్తం చేసిన రామలక్ష్మి గారినవలే యిప్పుడు సినిమాగా రూపొందిస్తు న్నారే ?

సినిమా దృష్టితో రాసిన నవల కాదన్న సంగతి చేయవలసిన పెద్ద మార్పులు— చూస్తే మీకె తెలుస్తుంది !

కె. హెచ్. బి పెదనందిపాడు

భారతదేశాన్ని మనవాళ్ళ 'మాత'తో గొలిపిస్తా రెందుకని—స్త్రీగా ఎందుకు చూస్తారని ?

ఈ దేశంలో మొదట్నుంచి గోమాతకీ భూ మాతకీ ఒకే గౌరవం ! ఎంత భారమైనా మోపి కిమ్మనక ఉంటుంది భారతమాత ఎంత పశువులా చూసినా 'గోమాత'ని మాసినట్టు గౌరవిస్తున్నారని మురిసి పోతోంది భారత స్త్రీ.

ప్రశ్నావళికి తమ సందేహాలు పంపే వారు కవరుపై లేదాకార్డుపై శీర్షిక పేరు వ్రాసి సంపాదకుడు, ఆంధ్ర పత్రిక వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ–3 అనే చిరునామాకే తమ సందేహాలు పంపాలి సం




దీపావళి కథల పోటీలో
రు. 750 లు
బహుమతి పొందిన కథ

నేను నిద్ర లేచేటప్పటికే. మాబాబు వాళ్లమ్మని ఏదో మారాం చేస్తున్నాడు. కళ్లు నులుముకొని చూచేటప్పటికి చిందులు కూడా తొక్కుతున్నాడు.

"ఏమిటి, ఇంత ప్రొద్దున్నే వాడి చేత నాట్యం చేయిస్తున్నావ్?" అన్నాను లక్ష్మితో

దానికి లక్ష్మి నవ్వుతూ, "వాడు చేయటం కాదండీ! నా చేతే చేయిస్తున్నాడు" అంది

''ఇంతకీ, ఏమిటి సంగతి?'' అన్నాను

''ఏముంది. ఈయనగారికి తుపాకి కావాలట''

''తుపాకా! వీళ్ల పంతులేమన్నా అన్నాడా ఏమిటి?''

''అదికాదండి. . ''

''పోనీ, మనింట్లో ఎవరేమన్నా అన్నారా? ఏం బాబూ! చెప్పు మీ అమ్మేమైనా అందా? ఐనా దానికి తుపాకి కావాలా? నేను లేనూ పెద్ద తుపాకిని.'' అన్నాను బుజ్జగిస్తూ

''అదికాదు నాన్నగారూ! దీపావళి పండగొస్తుందిగా అందుకు మా బళ్లో చాలా మంది కొనుక్కున్నారు నా ప్రక్కన కూర్చునే రాజుగాడు కూడా కొనుక్కున్నాడు ఒక్కసారి మోగించి యిస్తానంటే ఇవ్వలేదు'' అన్నాడు బిక్కమొహం పెట్టి

''ఓ అదా! సాయంత్రం వస్తూ, తెస్తాలే!'' అన్నాను

''నిజంగానా!'' అన్నట్లుగా చూచాడు వాడు నమ్మకంలేదు కామాల వెధవకి

''మీ అమ్మమీద ఒట్టు'' అన్నాను ఆనందంగా చిందులుతొక్కుతూ వెళ్లిపోయాడు. ఈ పిల్లలకి ఏడుపొచ్చినా చిందులే, సంతోషం కల్గినా చిందులే కాబోలు వాడి వంకే చూస్తున్న నన్ను "బాగుంది మీ

# అనిత 16 ఏళ్ల వనిత, ఇప్పుడిప్పుడే పరులదృష్టి నాకర్షించుటలోనున్న అనుభూతిని గ్రహిస్తోంది






మిలమిలా మెరిసే ఆమె
చర్మాన్ని సంరక్షిస్తూన్నది—
శుద్ధమైన, సున్నితమైన
సహజమైన సోపు.

## మైసూర్ శాండల్

మైసూర్ శాండల్ సోపు. మీ
చర్మాన్ని నిర్మలంగా, మృదువుగా మరియు
మిలమిలా మెరిసేటట్లు వుంచడానికి.

తయారుచేయువారు:
గవర్నమెంట్ సోప్ ఫ్యాక్టరీ, బెంగుళూరు



ఏకైక విక్రయ ప్రతినిధులు మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్ బెంగుళూరు - బొంబాయి - న్యూఢిల్లీ - కలకత్తా - మద్రాసు - సికింద్రాబాదు.

MCA/MSIL/SS/1

వరస ! వాడు అడగటం, మీరు కొనటం.'' అంది రుసరుసలాడుతూ లక్ష్మి.

''ఏం. కాదనమంటావా ?''

''కాదనమని ఎవరనమన్నారు. అప్పుడే ఎందుకు, ఇంకా నాలుగు రోజులాగి పండగ ముందు తెస్తాలే అనలేకపోయారు.''

''ఎప్పుడైనా తెచ్చేదేగదా ! పోనీ !''

''మీ రిలాగే పోనివ్వండి. పండ గొచ్చే నాటికి వాడది చెడగొట్టేసి మళ్ళా ఇంకో దానికి తయారు'' అంది.

''వాడు తయారేగాని, నన్ను ఆఫీసుకు తయారు చేసే దేమన్నా ఉందా ?'' చిరునవ్వు నవ్వుతూ అన్నాను.

'రా. నాయనా. రా. పళ్ళు తోమి లాల పోస్తాను.''

''అమ్మా !''

''ఇప్పు డత్తగారెందుకు ?''

''నీమీద ఫిర్యాదు చేయటానికి కాదులే. ఏది ?''

''వంట్లో సరిగా లేదు.''

''మరి, చెప్పలేదే ?''

''ఎక్కడ చెప్పనిచ్చారు. మీతో, మీ కొడుకుతోటే సరిపోయే.''

''ఆ ! ఇంతకీ వాడేడీ ?''

''చేరుంటాడు నాయనమ్మ దగ్గరకు.'' నేను మా అమ్మ ఉన్న గదిలోకి వచ్చేటప్పటికి, నా సుపుత్రుడు వాళ్ళ నాయనమ్మను తుపాకి సంగతే అడుగుతున్నాడు.

''హరి. నేను తెస్తానన్నాను కదరా !'' అన్నాను. వాడు చల్లగా జారుకున్నాడు అక్కడ నుంచి.

''అన్నీ నీ బుద్ధులేనురా అబ్బాయి. వాడికి'' నవ్వుతూ అంది అమ్మ, సరిలేక పోయినా. ఈ మాట రోజు కొకసారైనా అనకపోతే అమ్మకు తృప్తి ఉండదు.

''ఎలాగుందమ్మా ?'' అనడిగాను.

''ఎలాగుండేదేమిటిరా. వయసయిపోటంలా. అంతకు మించిన అనారోగ్య మేముంది, ఈ శరీరానికి.''

''అని, మందులు వాడటం అశ్రద్ధ చేయకమ్మా !'' అన్నా. ''అన్నయ్యకు జవాబు ఏమని వ్రాయమంటావమ్మా ?'' అని అడిగాను. ''వ్రాశేదేముందిరా. అంత దూరం ఇప్పుడెక్కడ వెళ్తాను. ఈసారికి అమ్మ రాలేదులే అని వ్రాయి'' అంది. నాకూ, అదే రాయాలని ఉంది. అమ్మని, దీపావళి పండక్కి ఇక్కడకు పంపు అంటూ వ్రాశాడు అన్నయ్య. వాడు విశాఖపట్నంలో లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు. నలుగురు పిల్లలూ, సంసారం. వాడి కొచ్చే జీతం సంసారానికి సరిపోతుంది. ఇంకా అక్కడికి అమ్మని పంపి బాధ పెట్టడం అనవసరం.

కాఫీ ఇస్తూ లక్ష్మి, ''మా అమ్మా వాళ్లకు కూడా ఉత్తరం వ్రాసేయండి'' అంది.

''ఏమని ?''

''తెలియనట్లడుగుతారే. మీ అమ్మాయి రావటానికి వీలుపడదని.''

---

## *దీపావళి కథలపై వ్యాసరచన పోటీ, పాఠకుల బాలట్ !*

★ ఈ వారంతో దీపావళి పోటీలో ఎన్నికైన నాలుగు కథల ప్రచురణ పూర్తి అయింది. అకారాదిగా వర్ణమాలక్రమంలో వాటి పేర్లు *కుంటికాకి, గృహవిక్రయం, దీపావళి, పట్టుచీర.* వీటిని పాఠకులు తమకు నచ్చిన క్రమంలో యీ సంచికలోని బాలట్ పత్రంలో వ్రాసి, ఏ కథకు ఏ స్థానం యివ్వాలో నిర్ణయించాలి.

★ కథలు మీకు ఎందుకు నచ్చాయో తెలియచేస్తూ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఒక కాలమ్ మించకుండా (750 లేదా 800 అక్షరాలు మించకుండా) ఒక వ్యాసం వ్రాసి, దానితోపాటు బాలట్ పత్రాన్ని పూర్తిచేసి రెండిటిపైనా పూర్తి చిరునామా వ్రాసి, రెండూ జతచేసి కవరులో పెట్టి ''దీపావళి కథలపై వ్యాసరచనపోటీ'' సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ–520003 కి పంపాలి

★ వ్యాసాలలో ఉత్తమమయిన మూడింటికి రు. **250** లు, రు. **200** లు, రు. **150** లు ఆ వరుసలో ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు యిస్తాము.

సంపాదకునిదే తుది నిర్ణయం ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు లేదు.

**వ్యాసాలు, బాలట్ పత్రాలు మాకు**
**అందవలసిన ఆఖరుతేదీ 14-12-1974**

***బాలట్ పత్రం యిదే సంచికలో 5 వ పేజీలో వేశాము. బహుమతులుపొందిన నలుగురు రచయితలుతప్ప పాఠకులంతా వ్యాస రచనపోటీలో పాల్గొనవచ్చును.***

_ సం.

''అక్కడ, మీవాళ్ళ నువు పోతానంటే, నేనేదో నిన్ను పగ్గాలుపట్టి వెనక్కు లాగుతున్నాను అనుకునేనుసుమా!'' అన్నాను నవ్వుతూ. మా మామగారు మొన్ననే ఉత్తరం వేశారు, పండక్కి రమ్మంటూ.

కాఫీ తాగ్గానే, లక్ష్మి అందించిన సరుకుల పట్టీ అందుకొని సైకిలెక్కేను. కొట్టతను ఒక్కోదాని ధర చెప్తుంటే, నెత్తిమీద ఒక్కో బాంబు పేల్తున్నట్లుగా వుంది. ఏమిటీ దారుణం అన్పించింది. మెల్లగా ఆ మాటలు బయటికి వచ్చినయికూడా.

''దారుణమా సార్!'' అని నవ్వి, సరుకులు కొంటానికొచ్చిన కొత్తమొఖంలా గుండే అన్నట్లుగా ఎగాదిగా చూచి, ''ఈ ధరలు ఏ నెలలో స్థిరంగా వున్నాయి చెప్పండి? కాకపోతే ఈ నెలలో మరి కొంచెం. అంతేగా!'' అతి తేలిగ్గా అన్నాడు. ప్రక్కనే సరుకులు కొంటున్న నడివయసాయన. ఆ కళ్ళు, ఆ మొహంతీరు మటుకు అనుభవాలు జీర్ణించుకొని రాటుదేలినట్లుగా ఉంది. ఆ మాటల్లో కొంత నిర్లిప్తత కూడ వుంది. ఏడ్పులోసహితం నవ్వగల మనిషిలాగానూ వున్నాడు

''మేమటుకు ఏం చేస్తాంసార్! సంవత్సరం పొడుగూతా ఏదో ఒక బడ్జెట్ వస్తానేవుండె'' అన్నాడు కొట్టతను, తన తప్పేమీ లేదన్నట్లుగా. మాట్లాడకుండా సరుకులు కొన్నాను. చిల్లరేదో మూడు నాలుగు రూపాయలు మిగిలింది జేబులో. బాబుకి తుపాకి కొందామని వెళ్ళాను. కానీ, వెళ్లిన తర్వాత, దాని ధరా కనుక్కొని కొందామంటే మనసొప్పలేదు, ఎందుకో. కొద్దిసేపు, కొందామా, వద్దా అని ఆలోచించి వెనక్కి తిరిగాను. ఇంతవరకు ఇలా నేనెప్పుడూ ఆలోచించలేదు, బాధపడలేదు జీవితంలో. కానీ, నిత్యం పెరిగే ధరల్తో, సామాన్యుడి పరిస్థితి ఏమిటి, నా పరిస్థితే ఇలా వుంటే. నాకు వచ్చే జీతంతో రాజా జీవితమే గడుపుతున్నాను, ఇక్కడ. ఇది మధ్యతరగతి పట్టణం. సగటున మనిషి ఖర్చు చాలా తక్కువ, చాలా పట్టణాలమీద. అటువంటిది ఒక్కనెలలో ఇన్ని రూపాయలు పెరగటమంటే ... ... ఇంటికొచ్చిన తర్వాత భోంచేస్తున్నంతసేపూ ఇదే ఆలోచన. లక్ష్మి మధ్యలో అడిగిందికూడా.

''రోజూ అవీ, ఇవీ తెగమాట్లాడుతుండే వాళ్ళు, ఇవాళేమిటింత మౌనంగా భోంచేస్తున్నారని?'' ఏం చెప్పలేదు, ఆలోచన తెగక నేను

ఆఫీసుకొచ్చాను. నేనొచ్చేటప్పటికే గేటు దగ్గర నాకోసమేలాగుంది కాపలా కాస్తున్నాడు సుబ్బులు, మా ఆఫీసు ప్యూన్.

''బాబూ!'' అన్నాడు చేతులు నలుపుకుంటూ. ఏమిటన్నట్లుగా చూశాను, సైకిల్ షెడ్‌లో పెడదామని, అటు నడుస్తూ. సుబ్బులే, సైకిల్ నాదగ్గర తీసుకొని షెడ్‌లో పెడ్తూ, ''ఒక పాతిక రూపాయలు కావాలి బాబూ!'' అన్నాడు.

''ఎందుకు?'' అని నోటిదాకా వచ్చింది. అడగటం భావ్యంకాదని ఊరుకున్నా. పెరిగిన ధరల్తో, పెరగని జీతంతో, నాదగ్గర అప్పుగా తీసుకొనే పాతిక రూపాయలు ఏ మూల కబురనుకున్నాను. ''ఎప్పుడు కావాలి?'' అన్నాను.

''ఓ రెండ్రోజులాగి యివ్వండి. చాలు బాబూ!'' అన్నాడు. ''సరే!'' నని ఆఫీసులోకి నడిచాను.

> బాలట్ పత్రం
>
> ఆంధ్ర పత్రిక వారపత్రికలోనిదే
>
> **వాడతీరాలి** సం.

మధ్యాహ్నం, లీజర్‌లో ప్రక్కనేవున్న కాంటీన్‌లో కాఫీ త్రాగుతుంటే, మా హెడ్ క్లర్కు వచ్చి ఎదురుగా కూర్చున్నాడు. అవీ, యివీ లోకాభిరామాయణం కొద్దిసేపు మాట్లాడుకున్నాం. కాఫీకి బిల్లు నే నివ్వబోతుంటే, ఆయనే తీసుకొని ఇచ్చి ''చూడు మూర్తీ...'' అని కొద్దిసేపాగి ''ఒక యాభై రూపాయలుంటే సర్దగలవా!'' అన్నాడు, కొద్దిదూరం నడచిన తర్వాత.

గంపెడు సంసారం, ధరలు ఆకాశాన్నంటి కనపడకుండా పోతున్న ఈ రోజుల్లో ... ''సరే!'' నన్నాను. ''సాయంత్రం మీ ఇంటికి మా మూడోవాణ్ణి పంపుతాను. ఇచ్చి పంపు'' అన్నాడు.

సాయంత్రం ఆఫీసు నుండి యింటికి వస్తుంటే కూడా వచ్చిన తోటి ఉద్యోగి, మిత్రుడు ''ఆ మందుల షాపులో రెండు తుపాకులు కొనుక్కెళదాం. పద' అన్నాడు.

''రెండా?'' అన్నాన్నేను.

''అవునుమరి! ఇద్దర్ని కన్నానుగా తప్పదు'' అన్నాడు.

అక్కడికి వెళ్ళిన తర్వాత వాడు రెండు కొంటూ, ''నీకూ ఒక డున్నాడుగా. కొనెయ్! అన్నాడు. మళ్ళా ప్రొద్దున వాడికిచ్చిన మాట గుర్తు కొచ్చింది. కొందామా, వద్దా అనే ఆలోచనలో ఉన్నాను.

''ఏమిటిరా, దీనికి ఆలోచన. కొనక'' అన్నాడు.

''ఇప్పుడు కాదులే!'' అన్నాను. ''ఏం జేబులో డబ్బుల్లేవా? పోనీ, అప్పిస్తాను'' అని, ''అయినా, నేను నీకు అప్పిచ్చేటంతటి వాణ్ణటూ? ఆఫీసర్‌కైనా అప్పివ్వగలవాడివి నువ్వు'' అన్నాడు నవ్వుతూ వాడన్నట్లుగా అందరికీ అప్పు లివ్వటానికి నా దగ్గర డబ్బు కొల్లలుగా మూలగటంలేదు కానీ, జీతం వచ్చినంతలో, జాగ్రత్తగా మిగిలిస్తూ గడుపుతున్నాను. అవే, అప్పుడప్పుడు ఎవరన్నా తోటి వాళ్ళు అడిగితే ఇస్తుంటాను.

మిత్రు డింటికేసి మిత్రుడ్నొదిలేసి, ఇంటికేసి సైకిల్ నడుపుతున్న నాకు, రోడ్డు ప్రక్కగా సీమ టపాసులు కాలుస్తూ ఒక పిల్లాడు కన్పించాడు. అతనికి వంటినిండా సరిగా బట్టలు కూడా లేవు. జుట్టుకి తైలం అంటే ఏమిటో తెలిసినట్లు లేదు. ఒళ్ళు జుట్టుకి పోటీ పడటం మానలేదు. వరసన కాలుస్తున్నాడు. అవి పేలిపోతున్నాయి, శబ్దం చేస్తూ.

ఇంటి కొచ్చేటప్పటికి సుపుత్రుడు నాకోసమే ఎదురు చూస్తున్నాడు వీధి వాకిట్లో. నేను సైకిల్ ఆపీఆపగానే దగ్గరకొచ్చి, నా చేతులూ, జేబులూ అన్నిటినీ నిశితంగా పరిశీలించసాగాడు. ''నాన్నగారూ! ఏది తుపాకి?'' అని చెయ్యి చాపాడు.

''లేదు తేలేదు'' అన్నాను. నాకు తెలియకుండానే కొద్దిగ కర్కశత్వం చోటు చేసుకుందా మాటల్లో. వాడు ఏడవసాగాడు చిందులేస్తూ. అమ్మైనా ఒకటే, నాన్నయినా ఒకటే వాడు అడిగింది కాదన్నపుడు, లేదన్నపుడు. ఇంట్లోకి నడిచాను.

''ప్రొద్దున తెస్తానని చెప్పట మెందుకు? ఇప్పుడు వాడిని ఏడ్పించటమెందుకు?'' అంది లక్ష్మి.

''నువ్వే వద్దన్నావుగా!'' అన్నాను నవ్వుతూ. ఆ నవ్వులో ఏదో లోపం కన్పించింది నాకు.

''నేను వద్దన్నానని తేలేదా? సరే. ఇప్పుడు వాడ్ని సముదాయించమంటున్నాను సముదాయించండి'' అంటూ వంటింట్లో

కెళ్లింది వాడ్ని సముదాయించడం నాతరం కాలేదు కోపంవచ్చి పెద్దగా కసురుకునే టప్పటికి, పెద్దగా వెక్కిళ్లుపెట్టి ఏడ్వ సాగాడు. దానికి అమ్మ పరుగెత్తినంత పని చేస్తూ వచ్చింది, అనారోగ్యంలోనూ "ఛ! ఏమిట్రా ఆ కసురుకోవడం. పిల్లాడ్ని సముదాయించడం ఇలానేనా ?" అంటూ వాడ్ని బుజ్జగిస్తూ తీసుకపోయింది, "రేపు తప్పకుండా తెస్తాడులే!" అని చెప్తూ.

రాత్రి భోంచేసి మంచంమీద పడుకున్నానే గాని ఆలోచనలు ఆగటంలేదు. ఇందాక, దోవలో తగిలిన ఆ పిల్లవాడే గుర్తుకువస్తున్నాడు ఇల్లు సర్దేసివచ్చి మంచంమీద కూర్చుంటూ అంది లక్ష్మి. "రేపు పండక్కి ఏం చేయమంటారు ?" అని "ఏదో ఒకటి చెయ్"

"ఏదో ఒకటంటే .ఏమిటో చెప్పండి."

"ఏమిటా..?" ఈ లోకంలోకొచ్చాను పూర్తిగా "కొంచెం తక్కువ ఖర్చుతో ఏదైతే, అది చెయ్."

"తక్కువ ఖర్చా!" నవ్వి "దిబ్బరొట్టెలు చేయమంటారా ?" అంది.

"అదికాదు ప్రతినెలా మనం మామూలుగా తెచ్చుకునే సరుకులకే, ఈ నెలలో ఎంత అదనంగా చెల్లించాల్సి వచ్చిందో చూశావుగా!" అన్నాను.

"మన మొక్కళ్లమేనా ఏమిటి? దేశంలో అందరూనూ!" అంది. అతి తేలిగ్గానూ అంది "నిజమే. కానీ, అనవసరపు ఖర్చులు తగ్గించాలని చూస్తున్నాను" అన్నాను.

"ఏమిటి తగ్గిస్తారు. చెప్పండి. ఒక పూటే భోజనం చేద్దామంటారా ?" వేళాకోళంగా అంది

"అలా అన్నానా! రేపు పండక్కి మందులు కొనకూడదనుకుంటున్నాను" అన్నాను. ఆ మాటలకి కొంచెం పెద్దగానే నవ్వింది. "మందులు కొనరూ? సంవత్సరాని కొక్కసారి వచ్చే పండగ ఎప్పుడూ రమ్మంటే వస్తుందా? మందులు కొంటే ఎంతకి, ఒక పదికి కొంటారు లేకపోతే పదిహేనుకు కొంటారు. ఐతే, ఇంకో ఐదు ఎక్కువ అంతేగా. ఆ మాత్రానికి, ఖర్చును కొని పండగ చప్పగా చేసుకుందామా ?" అంది.

"నీకేమీ తెలియటంలేదు, అర్థం కావటంలేదు" అన్నాను.

"ఏమిటి తెలియందీ, అర్థం కానిది. అనవసరపు టాలోచనలు మానుకోండి" అంది దీపం ఆర్పేస్తూ "ఏం మీ సోషలిజం మిత్రుడుగాని చెప్పాడా ?". అంది ఇందాక, తుపాకులు కొన్నవాడేను, నా సోషలిజం మిత్రుడు.

మరునాడు ఆఫీసులో, మధ్యాహ్నం లీజర్‌లో నలుగురం కూర్చుని ఆ కబురు ఈ కబురు చెప్పకుంటున్నప్పుడు, ఈ విషయం ఎత్తాను "ఈమందులూ అవీ కాల్చడమంటే మన డబ్బుకి మనం చేతులారా అగ్గిపుల్ల అంటించుకోవటమేనని." దానికి అందరూ పెద్దగా నవ్వి "మరీ ఇంత పిసినారివైతే ఎలాగురా!" అని ఒకతను, "డబ్బు వడ్డీల కివ్వటం మరిగిన తర్వాత, మరీ నువ్వు మారిపోయావులే బ్రదర్" అని ఒకతను, ఇంకా ఇలాటి మాటలే అంతా అన్నారు నాకు మతి ఉన్నంతవరకూ ఎవరికీ డబ్బు వడ్డీల కివ్వలేదు. అలా ఎదుటివాళ్ళని ఊరికే బాధపెట్టడం కొందరి నైజం "పండగ చప్పగా గడపటంలో ఆనంద మేముందిరా నాన్నా!" అన్నాడు నా సోషలిజం మిత్రుడు.

---

దీపావళి బహుమతిపొందిన కథ

---

ఇంటికి వచ్చేటప్పటికి మళ్ళా మావాడు తుపాకి కోసరం ఎదురు చూస్తూనే ఉన్నాడు. ఇవాళ ఆఫీసుకి బయల్దేరుతుంటే అమ్మ కూడా చెప్పింది. తేలేదని గ్రహించిన మరుక్షణమే వాడు ఏడ్పుకు లంకించుకున్నాడు.

"ఏమిట్రా అబ్బాయ్. నువు మరీను మీ నాన్నగారి అలవాటు నీ కొచ్చింది నీ అలవాటు నీ కొడుక్కొచ్చింది." అని నా పుత్రరత్నాన్ని బుజ్జగించే ప్రయత్నంలోపడ్తూ "కోడలితో ఏమిటి మందులు తేనని చెప్పావట" అంది.

"అవునమ్మా ఈ మందులు కాలవటం వలన ఏం ఉపయోగముంది చెప్ప అనవసరంగా డబ్బులు దండగ తప్పితే" అన్నాను. దానికమ్మ, బుగ్గలు నొక్కుకుని, "నువ్వేనట్రా ఈ మాట లనటం. చిన్నప్పుడు మీ నాన్నగారు మందులు తేవడం ఒక్క రోజు ఆలశ్యమయితే, ఎంత గోల చేసేవాడివి నిరుడూ చిన్న పిల్లాడిలాగా ఎన్ని మందులు కాల్చా!" అంది. నిజమే. నిరుడు దాదాపు పాతిక రూపాయల పైన నేకాల్చాను.

"నిరుటి పరిస్థితి వేరు, ఇప్పటి పరిస్థితి వేరు" అన్నాను నచ్చచెప్దామనే ప్రయత్నంలో నిరుటి...మొన్నటి నేను, ఇప్పటి నేను వేరు కూడా నామాటం విన్పించుకోకుండా "వేరు లేదు ఏమీ లేదుగాని, రేపన్నా వీడికి తుపాకి తీసుకరా!" అని గట్టిగా చెప్పి, "మందులు లేకుండా పండగ చప్పగా గడుపుతాడట. ఏమిటో ఈ బుద్ధులు" అనుకుంటూ బాబును తీసుకొని వెళ్లిపోయింది.

లక్ష్మికి అన్నా నచ్చచెప్దామనుకున్నాను. అసలే మాత్రం లాభంలేకపోయింది ఆ ప్రయత్నం అమ్మదగ్గర చేస్తే, అమ్మ నా మాటకు సరేననే దన్పించింది. "అసలతను ఎప్పుడు చూచినా సోషలిజమనీ, అదనీ, ఇదనీ తప్పితే ఇంకేం మాట్లాడడు, అతన్తోటి తిరక్కండీ అని చెప్తే మీరు నా మాట విన్పించుకున్నారూ ? ఇప్పుడు చూడండి ఎలా మారిపోయారో ?" అంది దైన్యం గూడు చేసుకుంది మాటల్లో.

ఆ సోషలిజం మిత్రుడికీ, మందులు లేకపోతే పండగ గడవదని తెలీదు లక్ష్మికి

"అసలు, మా ఇంట్లో ఎంత బాగా చేస్తారు పండగ మీకూ తెలుసుగా" అంది.

అంతా తెలుసు నాకు. ఈ పండగ ఎప్పుడొస్తుందా అని ప్రాణం విడిచేవాడిని ఒకప్పుడు, చదువుకునే రోజుల్లో. ఈ పండగ సీజన్ రాగానే, ఆ పుస్తకాలకనీ, ఈ పుస్తకాలకనీ; ఆ ఫీజులనీ, ఈ ఫీజులనీ ఇంట్లో డబ్బులు తీసుకొని కాలేజీ అంతా నానా అల్లరీ చేసేవాడిని తోటి మిత్రులతో కలసి. మా కిష్టంలేని లెక్చరర్ వస్తుంటే, అసమ్మతిగా టపాసులు, బాంబులు ఆయన చుట్టూ వేసి కనపడకుండా తప్పకోవటం, ఎవరన్నా ఆడపిల్లలు చెప్పేట్లుంటే, మీ జడలకి టపాసులు కట్టి అగ్గిపుల్ల గీస్తానని బెదిరించటం ... ఓహ్! అవన్నీ మరపురాని, మరువలేని మధురక్షణాలు. కానీ, అప్పుడు ఎంత...ఎంత డబ్బు తగలబెట్టాను ?

ఈ పండుగకి మందులు పేరుతో మనం డబ్బు తగలబెట్టడం అవివేకం, అనవసరం అని అటు ఆఫీసులోనూ, ఇటు ఇంట్లోనూ ఎవరినీ ఒప్పించలేకపోయాను, ఆఖరికి నా సోషలిజం మిత్రుడితోసహా.

"మొన్నటి ఉద్యమంలో మన ఆఫీసు కాల్చివేస్తే మనమంతా ఎంత బాధపడ్డాం" అన్నాను వాడితో. ఉద్యమం పేరుతో, మా ఆఫీసు ఎరయింది కొందరికి. అప్పుడు, నా సోషలిజమ్ మిత్రుడు పెద్ద ఉపన్యాన మిచ్చాడుకూడా.

"ఇంతకంటే దారుణం ఇంకోటి ఉందా?... లేదు. ఈ ఆఫీసులు ఎవరివి?... మనవి. అంటే ప్రజల సొమ్ము. అంటే మన సొమ్మేగా."

మన ఆఫీసులను, మన సొమ్మును మనం కాల్చుకోవటం అంటే మన ఇంటికి మనం నిప్పంటించుకోవటం కాదా?... అవును.

ఇది మనలో దాగి ఉన్న రాక్షసత్వానికి చిహ్నం కాదా?... అవును ఇలాగయితే, దేశంలో సోషలిజం రమ్మన్నా వస్తుందా? .. రాదు" అని అప్పటిదాకా ఊపిరి పీల్చుకోలేదు వాడు ప్రశ్నలూ సమాధానాలూ అన్నీ వాడివేను

"మందులు కాల్చటమంటే మన డబ్బుని మనం కాల్చుకోవటం కాదా! ఇది దారుణం కాదా? మనలో ఉన్న రాక్షసత్వానికి చిహ్నం కాదా?

నాకు స్టాటిస్టిక్సు తెలియకపోయినా, సగటున మనిషి ఒక రూపాయి ఈ పండక్కి ఖర్చు చేసినా, దాదాపు అరవై కోట్ల రూపాయలు మనం ఈ పండగ పేరుతో బూడిద చేసినట్లే!" అనీ అన్నాను. వాదించాను కూడా. ఎప్పుడూ అదనీ, ఇదనీవాడే వాదిస్తుంటాడు. కానీ, వాడిచేత కూడా ఈ మందులు కాల్చటం అవివేకం, అనవసరం అన్పించలేకపోయాను.

నేనే అవివేకినని తేల్చేశాడు వాడు. వాదించాడు కూడా. దేశంలో 'సోషలిజం' పరిస్థితి ఇలాగుందా అని బాధేసింది నాకు.

పండగ దగ్గరకొస్తుంది. ఇంట్లోవాళ్ళు నన్ను మార్చటానికి ప్రయత్నిస్తున్నారు. నా పట్టు నేను విడవలేదు తుపాకి కొనుక్కెళ్ళలేదు

"మన మొకళ్ళమే మడి కట్టుకుంటే సరి కాదండి!" అంది లక్ష్మి నన్ను మార్చటానికన్నట్లుగ "ఒకళ్ళని చూసి వాత పెట్టుకోవాలనే తత్వం కాబట్టే, మన దేశమిలా ఏడుస్తోంది!" అన్నాను.

"ఆహా! దేశోద్ధారకుడివి బయల్దేరావు లేరా!" అంది అమ్మ. వాడికి తుపాకి తేలేదని అమ్మకి మరీ కోపంగా ఉంది.

లక్ష్మి అదీ, ఇదీ మాట్లాడుతూ, సూటిపోటీ మాట లంటుంది. "ఇవాళ ఈ పండగని ఇలాగ చేస్తామంటారు. రేపు ఇంకో పండగ చెయ్యొద్దనే అంటారు. మీకేం?" అని బాధపడుతున్నారు వాళ్ళు.

నేను మందులు కొనటం దండుగ అంటున్నానని, నన్ను చూసి మొఖం చాటేస్తున్న, నాదగ్గర డబ్బులు అప్పుగా తీసుకున్న మా హెడ్‌క్లర్కు, సుబ్బులూ మందులు లేందే పండగ జరపటంలేదని తెలుసు. కానీ, ఆ నా ఉద్దేశాన్ని మార్చుకోవాలనే ఆలోచన రాలేదు నాకు.

రెండు మూడు రోజులు గడిచినయి. నేను ఆఫీసు నుండి ఇంటి కొచ్చేటప్పటికి, మా ఇంటిముందు పిల్లలతో ఆడుతూ బాబు కన్పించాడు. వాడి చేతిలో తుపాకికూడా వుంది. అనుమానమొచ్చి "ఎక్కడిదిరా?" అని అడిగాను.

"మిమ్మల్ని తెమ్మంటే మీరు తేలేదుగా. అందుకని నాయనమ్మ వాళ్ల రాముడిచేత తెప్పించింది" అని నవ్వుతూ, ఇంత గర్వంగానో చెప్పి ఆటలో పడ్డాడు. అక్కడి పిల్లలందరికీ, డిటెక్టివ్ సినిమాల అనుభవం లాగుంది. టిష్యుం, టిష్యుం అని శబ్దం కూడా చేస్తున్నారు తుపాకితోపాటు.

ఇంట్లోవాళ్లమీద కోపమొచ్చింది కానీ, ఎవర్ననేని? అమ్మని కోప్పడాలా? ఆ పని ఎప్పటికీ చేయలేను. ఇక లక్ష్మిని కోప్పడాలా? ఏ విషయంలోనన్నా అయితే అమ్మ ఊరుకునేదేమో గాని, ఈ విషయంలో మాత్రం వూరుకోదు. కోపం కొద్దిసేపటికి పోయింది. కానీ...బాధ. అది వదిలిపెట్టలేదు నన్ను.

ఇంకో రెండురోజులు గడిచినయి. పండగ యింకా నాలుగురోజులే వుంది. ఆరోజు ఆఫీసు నుండి కొద్దిగ ఆలస్యంగ వచ్చాను. చీకటిపడింది. వాకిట్లోనే కాకరపువ్వొత్తులు కాలుస్తూ స్వాగతమిచ్చాడు బాబుగాడు. వాడి ప్రక్కన వాడి మేనమామ కూడా వున్నాడు.

"ఎప్పుడొచ్చావు?" అని అడిగాను లోపలకొస్తూ.

"మధ్యాహ్నం బావా!" అన్నాడు. "నిన్నూ, అక్కనీ తీసుకెళ్దాం అని వచ్చాను" అన్నాడు. అతను కనపడగానే నా కర్థమైంది కూడా.

"వీలుపడదని ఉత్తరం రాశానే! అందలేదా?" అన్నాను. దానికతను చిద్విలాసంగా నవ్వాడు. నేను ఎంతో గట్టిగా, రావటానికి వీలుపడదు అని వ్రాసినా వచ్చాడంటే, దీని వెనుక ఏదైనా బలమైన కారణం వుందా అన్పించింది.

ఆ రాత్రి అమ్మ కూడా అంది. "నేనూ పెద్దాడి దగ్గర కెళ్తారా!" అని. ఆశ్చర్యంగా, అవాక్కయి చూశాను. "ఏమిటోరా! మొన్న నీతో అలా అన్నానా! ఇప్పుడేమో పిల్లల మీద గాలి మళ్ళిందిరా!" అంది. ఉదయమే ప్రయాణానికి సర్దుకోసాగింది, నన్ను ఏమీ మాట్లాడనీయకుండా.

"పాపం. మీరు రామని వ్రాశారని మీ మామయ్య తెగ బాధ పడుతున్నాడట. రెండు రోజులు సెలవు పెట్టి నువుకూడా రేపే వెళ్ళు" అంది. లక్ష్మిని ప్రయాణానికి సిద్ధం చేయించింది. నేను గట్టిగా వెళ్ళమనీ చెప్పలేదు. వెళ్ళొద్దనీ చెప్పలేదు.

అమ్మ ప్రోద్బలం కాని, లక్ష్మికి నామీద వచ్చిన కోపంగాని, లోపల అణగి ఉన్న కోర్కెగాని, ఏదైనాగాని లక్ష్మి ప్రయాణమైంది.

నేను ఆగమన్నా ఆగేస్థితిలో లేరు వాళ్ళు.

ఈ రెండు రోజులూ సెలవు దొరకదు అని చెప్పి ఆగిపోయాను నేను. వాళ్ళని రైలెక్కించాను. బండి కదులుతుంటే అమ్మ అంది. "కోపంతో రేపు అత్తగారింటికి వెళ్ళకుండా ఇక్కడే ఉండేవు. నీ వాలకం చూచి నేనే అమ్మాయిచేత ఉత్తరం రాయించాను. టపాసులు కాల్చినా, ఏం కాల్చినా నీ సొంత డబ్బులేం కాదుగా. వెళ్ళు" అంది నవ్వింది కూడా.

లక్ష్మి దాదాపు అదేమాటలంది. "కోపం వచ్చి రాకుండా ఉంటారా! నామీద ఒట్టే. ఐనా, మందులు మా నాన్న డబ్బులేగా. రండి" అంది. లక్ష్మి కనుకొనల్లో నీళ్ళు కూడా నిల్చినయి

"నువ్వు కాదు లక్ష్మి ఏడవాల్సింది. నేను" అనుకున్నాను మనసులో. బండి వెళ్ళిపోయింది. నడుస్తున్నాను. నిజంగానే ఏడుపొచ్చింది.

"వీళ్ళు ... వీళ్ళు...ఇంతాజేసి నన్నర్థం చేసుకుంది ఇలాగా?" అని.

కృష్ణ సమర్పించు శ్రీ విజయకృష్ణమూవీస్ విజయనిర్మల నటించిన 100వ చిత్రం



# చెయిజారిన స్వర్గం — మోర్తల గోపాలరెడ్డి

"నన్నేం చెయ్యమంటావ్ ? నేనేం డాక్టర్నా ? మీ వూళ్లో మంచి డాక్టర్లు చాలామంది వున్నారుగదా ?" అన్నాడు చంద్రం కర్కశంగా

"ఇప్పుడు దానికి కావాల్సింది డాక్టర్లుకాదు, నువ్వు ! నామాట విని పదరా చంద్రం !"

"నేను నీ ఇంటి గడప తొక్కను నీ కూతుర్ని పరామర్శించడానికి నేను రావాలన్నమాట ?"

దున్నపోతుమీద జడివాన కురిసినట్టు తప్ప ఎంత బ్రతిమాలినా శిలలాంటి చంద్రం మనసు కరగదన్న నిశ్చయానికొచ్చిన రాజమ్మ "నాకూతురు నాకు భారంకాదులేరా ! దాన్ని ఈ చేతులతో పెంచాను ఒకవేళ అదృష్టం బాగోలేక కన్ను మూసిందంటే ఈ చేతులతోనే స్మశానానికి తీసుకెడతానుకాని మళ్లీ నీకు కబురుకూడా చెయ్యన్లేరా !" అంటూ బయటికొచ్చింది తను అంత గట్టిగా మాట్లాడినందుకు తమ్ముడి మనసు మారి వెంట వస్తాడనుకుని వెనక్కితిరిగిన రాజమ్మకు మూసుకుంటున్న తలుపుల శబ్దం వినిపించింది తప్ప చంద్రం జాడ అసలు కనిపించలేదు

'చదువుకున్న మృగం' అనుకుంది.

ఇంటికి వెళ్లాక, దాచిపెట్టకుండా రాధకు చెప్పింది జరిగిందంతా

ఆ న్నేళ్లు గడిచిపోయాయి కూతురు కాపరం నిలవలేదన్న వ్యధతో రాజమ్మ మంచంయెక్కి రెండు నెలలయింది ఇంటి పనులన్నీ రాధ నెత్తిన పడ్డాయి అసలే ఆరోగ్యం అంతంతమాత్రంగా వున్న రాధకు యింటి బాధ్యతవల్ల మరీ శ్రమ ఎక్కువయింది మావయ్య తనను తీసుకెడతాడన్న ఆశ లేదు. బుజ్జితో తను యిక్కడే వుండిపోవాల్సి వచ్చేట్టుగా వుంది పండీ పండని రెండెకరాల వ్యవసాయంతో గంపెడు సంసారాన్ని ఈదుకు రావడం నాన్న వొక్కడివల్ల అయ్యే పనికాదు ఒక్క చేతికి మరొక చెయ్యి కలిపినప్పుడే శబ్దం వస్తుంది. తీవ్రంగా ఆలోచించిన రాధ తన చేతికి మిగిలివున్న బంగారు గాజు అమ్మి ఆంధ్రా మెట్రిక్ పుస్తకాలు కొని పరీక్ష ఫీజు కట్టింది పగలంతా ఇంటి పనులతో అలసిపోయిన రాధ రాత్రిపూట తన గదిలో దీపం వెలిగించుకుని పుస్తకాలు ముందు వేసుకుని బాగా పొద్దుపోయేవరకు చదువుతూ కూర్చునేది.

"నీ ఆరోగ్యం అసలే బాగోలేదు మధ్యలో ఈ చదువెందుకే అమ్మా" అంటూ రాజమ్మ మంచంమీది నుండే నీరసంగా మూలిగేది

"నీకు తెలియదులేవే" అంటూ రాధ నవ్వేది.

రాధ పరీక్షలు యింకో నెలరోజులకనగా ఓ అర్ధరాత్రి రాజమ్మ దగ్గి దగ్గి యిహ దగ్గలేక మందుల అవసరం లేకుండా, సేవలు చేయించుకోవడం యిష్టంలేనట్టు శాశ్వతంగా కన్ను మూసింది ఆరోజు ఆ యింట్లో ఏడుపులు, పెడబొబ్బలు గూడు కొట్టుకుపోయిన పిచుకల్లా వాళ్లంతా గిలగిలలాడిపోయారు. మొదలు తెగిన మ్రిచెట్టులా ఆ యిల్లు తయారయింది

పెళ్లిగ్రాం యిస్తే వచ్చిన చంద్రం ముభా

*(గత సంచిక తరువాయి)*

వంగా నాలుగు మాటలు మాట్లాడి మొక్కు తీర్చుకున్నవాడిలా వెళ్లిపోయాడు కొండంత అండగా వుండే తల్లిలేని లోటును గుండెలోనే కప్పుకుని నిశ్చలమైన ఆత్మవిశ్వాసంతో రాధ గుంటూరు వెళ్లి పరీక్ష వ్రాసింది. రెండునెలల తర్వాత పేపర్లో తన నెంబరు ఫస్ట్‌క్లాస్‌లో వుండడం చూసిన రాధ నమ్మలేకపోయింది మొదట్లో.

"కష్టపడ్డావు. పట్టుదలగా పరీక్ష వ్రాశావు కాబట్టే ఫస్టన ప్యాసయ్యావు తల్లీ !" అని తండ్రి నవ్వుతూ భుజంతట్టి చెపితే అవునేమోనన్నట్టు పరధ్యానంగా రాధ తలవూపింది

ఆంధ్రాబ్యాంక్ వాళ్లు పేపర్లో వేసిన అడ్వర్టైజుమెంటు చూసిన రాధకూడా క్లార్కు ఉద్యోగానికి అప్లికేషన్‌పడేసింది వేలమందితోపాటు తనూ పరీక్ష వ్రాసింది. తర్వాత వందలమందితో పాటు తానూ ఇంటర్వ్యూకు వెళ్లింది ఇంటర్వ్యూ అయిన నెలరోజులకు అప్పాయింట్‌మెంట్ ఆర్డర్ పోస్ట్‌లో వస్తే వణుకుతున్న చేతులతో కవరు చింపి, చదువుకుని పరుగెత్తుకువెళ్లి తండ్రి పాదాలమీద పడింది.

"లే, పిచ్చితల్లి !" అంటూ తండ్రి రాధను లేవనెత్తి ప్రేమగా తల నిమిరాడు.

"నాకు ఉద్యోగం దొరికింది నాన్నా ! ఇహ మన కష్టాలు గట్టెక్కుతాయి ఇంతకాలం నుండి కుటుంబ బాధ్యతంతా మీరే మోసుకొచ్చారు మీ బరువు కాస్త తగ్గించే అదృష్టం యిన్నాళ్లకు కలిగింది నాన్నా !"

"హాయిగా భర్తతో కాపురం చెయ్యాల్సిన నువ్వు మమ్మల్ని ఆదుకోవడానికి వుద్యోగం చేస్తావా అమ్మా ! చంద్రం అడిగిన నాలుగువేలు యిచ్చి నీ కాపురం నిలబెట్టలేని ఈ అసమర్ధుణ్ణి మన్నించు తల్లీ !" అంటూ నాయుడు కూతురు చేతులు తీసుకుని కళ్లమీద పెట్టుకున్నాడు.

"అంత మాట అనవద్దు నాన్నా !" అంటూ రాధ తండ్రి కన్నీళ్లు తుడిచింది

* * *

ఉదయం త్వరగా వంట ముగించి పిల్లలందరితో బుజ్జికికూడా అన్నంపెట్టి స్టీలు టిఫిన్‌లో యింత కూరన్నం కలుపుకుని పెట్టుకుని రాధ బ్యాంక్‌కు వెళ్లేది.

మధ్యాహ్నం తోటి వుద్యోగులు హాయిగా క్యాంటీన్‌కు వెడితే రాధ ఒక్కర్తే ఓ మూల కూర్చుని, వుదయమెప్పుడో కుక్కిపెట్టిన కూరన్నం తిని రెండు గ్లాసుల నీళ్లు త్రాగేది నెలాఖరున మూడువందలయాభై రూపాయల జీతం తీసుకున్న రాధకు — బ్యాంక్‌వాళ్లు యింతింత పెద్ద జీతాలు ఎందుకిస్తారో అనిపించింది అదేరోజు బ్యాంక్‌లోనే ఓ సేవింగ్స్ ఎకౌంటు తెరిచి అందులో నూటయాభై జమకట్టింది. సాయంత్రం ఇంటికి రాగానే రెండువందలు తండ్రి చేతిలో పెట్టి "ఒక నూటయాభై నేను వుంచుకున్నాను నాన్నా, నాకు కావాలి" అంది.

"ఆ సంగతి నాకు చెప్పడం దేనికమ్మా ? ఈ డబ్బుకూడా నీవద్దనే వుంచు ఇంటి పనులన్నీ చూసుకునేది నువ్వేగా !" అన్నాడు

రాధ దినచర్యలో మార్పు లేనట్టుగానే సూర్య చంద్రుల దినచర్యల్లో కూడా మార్పులేదు. ఎవరి పన్లు వాళ్లు చేసుకుపోతున్నారు రెండేళ్లు గడిచి పోయాయి బుజ్జికి మూడోయేడు వచ్చింది. రాధ ఈ రెండేళ్లలో శారీరకంగా, మానసికంగా చాలా మారిపోయింది. సన్నబడింది సాధించాలనుకున్న కార్యం పూర్తి అయ్యేవరకు మనిషిలో వుండే పట్టుదల లాంటి దాని తాలూకు లక్షణాలు ఎప్పుడు రాధ మొహంలో స్పష్టంగా కనిపిస్తాయి ఆలోచనలు ఎక్కువవడంచేత వెంట్రుకలు తెల్లబడుతున్నాయని డాక్టర్ ఓసారి చెప్పినప్పుడు రాధ నవ్వుకుంది. టానిక్కులు, యింజక్షన్స్ వ్రాసి యిచ్చిన ప్రిస్క్రిప్షన్‌ను భద్రంగా యింటికి పట్టుకొచ్చి మండే పొయిలో పడేసి 'నాకు మందులెందుకు ? ఈ మందులకు పెట్టే డబ్బు ఎకౌంట్లో వేసుకుంటే మంచిది' అని అనుకుంది చాలాసార్లు.

ఆరోజు వరండాలో కూర్చుని పేపరు చూస్తున్న రామినాయుడు టాక్సీ ఆగిన చప్పుడయి పేపరు మడిచి చూశాడు టాక్సీలోంచి దిగిన యిద్దరు ఆడవాళ్లు మరో యిద్దరు మగాళ్లు కలిసి రాధను నడిపించుకురావడం చూసిన నాయుడు పేపరు అక్కడే పడేసి వడివడిగా వాళ్లవైపు పరుగెత్తుకెళ్లి "ఏమయిందండి రాధకు ?" అడిగాడు కంగారుగా

"ఏం లేదండీ, ఇందాక బ్యాంకులో దగ్గుతూ వాంతిచేసుకుని రక్తం కక్కుకుంది డాక్టరుగారికి చూపించి ఇంటికి తీసుకొచ్చామండి" అంటూ వాళ్లు రాధను ఇంట్లోకి తీసుకెళ్లారు నాయుడు ఆదరాబాదరా మంచంవాల్చి ఒక దుప్పటి వేశాడు. రాధను ఆ మంచంమీద పడుకోబెట్టారు రాధ మొహం బాగా పాలిపోయివుంది జాకెట్ ముందు భాగం రక్తంతో తడవడంవల్ల ఎర్రగా భయంకరంగా వుంది. ఆయాసపడుతూ గాలి పీల్చుకుంటోంది పేలవంగా తండ్రిని చూసి నవ్వింది.

"డాక్టరుగారికి చూపించండి నాయుడుగారు" అంటూ వాళ్లంతా వెళ్లిపోయారు.

నాయుడికి అంతా అగమ్యగోచరంగా వుంది.

**జరిగిన కథ 3 : రాజమ్మ రామినాయుడుల**

ఆరుగురి సంతానంలో రాధ పెద్దది కట్నం యివ్వలేక రెండోసెల్లి వాడైనా తమ్ముడు చంద్రంతో రాధ పెళ్లి జరిపిస్తుంది రాజమ్మ. మరదలు శాంతకు నాలుగు వేలిచ్చి వివాహం చేయటం అవమానంగా భావించి తనకూ కట్నం తెమ్మని భార్యను పుట్టింటికి పంపేస్తాడు చంద్రం. రాధ తనను ప్రేమగా చూచుకునే మామయ్య ఎలా మారిపోయాడో తలచుకుని బాధపడుతుంది. రాధ ఆరోగ్యం చెడి, పుట్టిన బిడ్డ మర్నాడే మరణించగా రెండవసారి తమ్ముడ్ని బ్రతిమిలాడి భంగపడుతుంది రాజమ్మ.

కాళ్లూ చేతులూ ఆడలేదు మనసు కీడును శంకించింది ఇంటికి దగ్గర్లోవున్న డాక్టర్ వలపతిని పిల్చుకొచ్చారు డాక్టర్ చలపతి రాధను ఎగ్జామిన్ చేసి "యిన్నాళ్లనుంచి ఏం చేస్తున్నారు ?" అన్నాడు ఆ ప్రశ్నతో నాయుడి నవనాడులు కృంగిపోతున్నట్లనిపించింది అగాధమయిన వూబిలోకి దిగబడిపోతున్న తనను చీకటితెర చుట్టుకున్నట్టు డాక్టర్‌వైపు చూశాడు డాక్టర్ ప్రశ్నలో గూడు కట్టుకునివున్న జవాబు గాలిలో దీపంలా కళ్లముందు కదిలింది

"మీరనేదేమిటి డాక్టర్ ?"

"రాధకు క్షయ వుంది బాగా ముదిరిపోయింది ఇన్నాళ్లనుంచి నాకెందుకు చూపించలేదండీ ?" అన్నాడు చలపతి కోపంగా విసుక్కుంటూ

"నాకసలు తెలీదండీ ?" అన్నాడు నాయుడు షాక్ తిన్నవాడిలా

"పెద్దవాళ్లు మీరు వుండగా ఇలా ఎలా



జరిగిందండీ ? మంచి ట్రీట్‌మెంట్ వెంటనే యిప్పించండి అశ్రద్ధచేసి లాభంలేదు" అంటూ డాక్టర్ చలపతి వెళ్లిపోయాడు

"ఇదంతా ఏమిటమ్మా ? ఈ సంగతి నీకు తెలీదా ?"

"నా సంగత నాకెందుకు తెలియదు నాన్నా?"

"మరెందుకు నాతో చెప్పలేదమ్మా ?"

"నేను అనుకున్న పని అయిపోయింది నాన్నా ! ఇప్పుడు ట్రీట్‌మెంటు తీసుకుంటాను "

"ఏమిటమ్మా నువ్వు అనుకున్న పని ?"

"తొందరపడకండి నాన్నా త్వరలో మీకు తెలుస్తుంది" అంది రాధ చెదరిపోతున్న సన్నటి చిరునవ్వు పెదవులమీద నిలుపుకుంటూ

"ఏమిటోనమ్మా నాకు అయోమయంగా వుంది ?"

చంద్రానికి తెలియపరచటం మంచిదనే ఉద్దేశంతో వివరంగా ఉత్తరం వ్రాశాడు ఉత్తరం వ్రాసిన రెండువారాలకు కూడా చంద్రంవద్ద నుండి జవాబు రాలేదు ఉత్తరం అందివుండకపోవచ్చని టెలిగ్రాం యిచ్చాడు టెలిగ్రాంకు కూడా ఉత్తరం గతే పట్టింది

డాక్టర్ చలపతి చెప్పిన మందులు ఇంజెక్షన్లు తెచ్చాడు నాయుడు ప్రతిరోజు చలపతి వచ్చి ఇంజెక్షన్లు యిస్తూనేవున్నాడు కానీ రాధలో కాస్తకూడా మార్పురాలేదు రోజు రోజుకు దిగజారిపోతున్న రాధ పరిస్థితి చూసి నాయుడు అడిగాడు

"అవునండీ అంతా అయిపోయాక డాక్టరువద్దకొస్తే అతడుమాత్రం ఏం చేయగలడు ? అమృతం పోసి బ్రతికించడానికి డాక్టరేం దేవుడుకాదు గదండీ? ఏ జబ్బుకయినా అశ్రద్ధ చేయకుండా మొదట్లోనే ట్రీట్‌మెంట్ తీసుకుంటే కుదురుతుందిగాని బాగా ముదిరిపోయాక వస్తే డాక్టర్ల చేతుల్లో ఏముంది? క్షయే కాకుండా రాధకు గుండెజబ్బు కూడా వుంది. ఒకసారి చంద్రాన్ని పిలిపించండి రాధకు కాస్త ధైర్యంగా వుంటుంది" అన్నాడు చలపతి

"చెయ్యాల్సిన ప్రయత్నాలన్నీ చేశానండీ కట్నం డబ్బు యివ్వలేదన్న కోపంతో మూడేళ్లనుండి మా యింటికి రావడంలేదు రాధ పరిస్థితి వివరిస్తూ ఉత్తరం వ్రాశాను టెలిగ్రాం ఇచ్చాను నేనే వెళ్లివద్దామనుకుంటున్నాను."

"చదువుకుని బాధ్యత తెలిసిన కుర్రాళ్లు యిలా ప్రవర్తిస్తున్నారంటే ఆశ్చర్యంగా వుంది" అన్నాడు చలపతి

వాళ్ల మాటలు విన్న రాధ "నాన్నా ! మీరెళ్ళాల్సిన పన్లేదు ఇలా రండి" అంటూ ఖణేలుమని గుక్కతిప్పుకోకుండా దగ్గి "అబ్బా" అంటూ గుండె పట్టుకుంది

"పదండి డాక్టరుగారు" అంటూ నాయుడు రాధ మంచం వద్దకు పరుగెత్తుకొచ్చాడు.

స్టెతస్కోప్‌తో రాధను ఎగ్జామిన్‌చేసి "మళ్లీ గుండెపోటు వచ్చిందండీ" అన్నాడు సన్నగిలిన ధైర్యంతో

"ఏదన్నా చెయ్యండి డాక్టర్ ! నాతల్లి ఎలా మెలికలు తిరిగిపోతోందో చూడండి ! దాని బాధ నేను చూడలేను" అంటూ క్రింద కూలబడి మంచంపట్టెకు తల ఆన్చాడు నాయుడు

"వూరుకోండి నాన్నా ! నా దిండుక్రింద ఒక కవరు వుంటుంది అది యిలా యివ్వండి" అంది రాధ ఒక్కొక్క మాటను కూర్చుకుని బలవంతంగా, ప్రయాసతో.

"ఇప్పుడేం కవరు తల్లీ !"

"పోస్ట్ టైం కావస్తోంది నాన్నా ! ఆ కవరు యివ్వండి ఉత్తరం యివాళే పోస్ట్‌చెయ్యాలి. టైం కావస్తోంది నాన్నా !"

గుటకలుమింగుతూ, దిండుక్రింద వున్న పొడుగాటి ఎయిర్‌మెయిల్ కవరు తీశాడు

కవరుమీది అడ్రసు చూసి ఆశ్చర్యపోయాడు.

"ఈ వుత్తరం ఎప్పుడు వ్రాసిపెట్టావమ్మా ?"

"ఇలాంటి స్థితిలో ఎలాగు వుత్తరం వ్రాయలేనని తెలుసుకాబట్టి చాలారోజుల క్రితమే వ్రాసిపెట్టి వుంచాను నాన్నా ! టైం దగ్గరపడుతోంది. మీరు వెళ్లండి నాన్నా ! తొందరగా పోస్ట్ చేసి రండి "

టైం దగ్గరపడుతున్నది పోస్ట్‌కు కాదు—రాధ మృత్యువుకు అనిపించింది నాయుడికి

"అలాగే వెడతానమ్మా లాంతరు వొత్తి ఎక్కువచేసి పోతాను "

"ఈ లాంతర్లో నూనెలేదు నాన్నా ! మీరెంత ప్రయత్నించినా అది ఆరిపోక మానదు టైం కావస్తోంది మీరు వెళ్లండి నాన్నా !" అంటూ రాధ సన్నగా నవ్వడానికి ప్రయత్నించింది ఆ నవ్వు ఆమె పెదవులమధ్య గిలగిలలాడిందే తప్ప బయటికి రాలేకపోయింది

"గాడ్ సేవ్ హర్" అంటూ డాక్టర్ చలపతి కళ్లజోడు తీసి, స్టెత్ చెస్ట్‌లో పడవేశాడు

*　　*　　*

వారంరోజుల క్రితం వుద్యోగంలోంచి సస్పెండ్ అయిన చంద్రం మరో ఉద్యోగానికి అప్లికేషన్ వ్రాసుకుంటుండగా పోస్ట్‌మాన్ పిలుపు వినిపించి బయటికి వచ్చాడు సంతకంచేసి ఎక్స్‌ప్రెస్ డెలివరీ కవరు అందుకున్నాడు తనకు బాగా పరిచయం వున్న కవరుమీది దస్తూరి చూస్తూ కవరు చించి వుత్తరం బయటికి తీశాడు. మడతలు విప్పి చూశాడు

చంద్రం మావయ్యకు --

ఈ వుత్తరంలో వ్రాస్తున్న విషయాలు నీతో స్వయంగా చెప్పకునే అదృష్టం నాకు లేనందుకు నా దురదృష్టాన్ని తిట్టుకుంటూ ఉత్తరం మొదలుపెడుతున్నాను నాన్న ఎలాగు నువ్వు అడిగిన నాలుగువేల కట్నం యిచ్చుకోలేడని నాకు తెలుసు కట్నం తెచ్చేంతవరకు నన్ను నీ గడప తొక్కనివ్వవని తెలుసు చీకటిలో చిక్కుకున్నట్లుగా

(31వ పేజీ చూడండి)



''భారతి''లో ఒక దృశ్యం



''చదువు–సంస్కారం''లో మరో దృశ్యం

# సినిమా

### రావు చిత్రానికి రెడ్డియార్ కథ

దర్శకుడు కె. వి. నందనరావు, ఎస్. ఎల్. జె. మనోహర్ కల్సి ''శ్రీ సుధా చిత్ర'' అనే చిత్ర నిర్మాణ సంస్థను స్థాపించారు. ఆ చిత్రానికి సుబ్రమణ్య రెడ్డియార్ కథను సమకూర్చారు. (పుట్టినిల్లు–మెట్టినిల్లు, పసి హృదయాలు చిత్రాల కథకుడు). డిశంబరు నుండి ఈ చిత్రం తాలూకూ షూటింగ్ ఆరంభ మౌతుంది. చిత్రం స్క్రీన్ ప్లే, దర్శకత్వాన్ని నందనరావు చేపట్టారు. సంగీతానికి సత్యం, సంభాషణలకు మహారథి, ఛాయకు మధు, కళకు భాస్కరరావు, కూర్పుకు సుబ్బారావు కర్తలుగా వ్యవహరిస్తున్నారు.

### జెమినీలో జానకి, లత

పై చిత్రానికి సంబంధించిన ఓ పాటను సత్యం విజయదశమినాడు జెమినీ రికార్డింగు థియేటర్లో రికార్డ్ చేసారు. ''శ్రీరామ చంద్రునితో సీత, మమ్ము కరుణించి దీవించుగావుత'' అనే ఆరుద్ర గీతాన్ని యస్. జానకి, బెంగుళూరు లత పాడారు. చంద్రమోహన్, గీతాప్రసాద్, ప్రభాకర రెడ్డి, అల్లు రామలింగయ్య, సి. హెచ్. కృష్ణమూర్తి, జయంతి, ప్రమీల, రోజారమణి, ఎస్. వరలక్ష్మి మున్నగువారు ప్రధాన పాత్రలను పోషించే ఈ చిత్రాన్ని వుగాదికి పూర్తిచేసి, విడుదల చేయాలని అభిప్రాయ పడుతున్నారట భాగస్వాములు.

### శ్రమ జీవులపై పెత్తందార్ల దౌర్జన్యం

మనకు స్వాతంత్ర్యం సిద్ధించకమునుపు తెలుగు నాట తెలంగాణా ప్రాంతంలో అత్యధికంగా వుండేది. కండలు కరిగించి పనిచేసే శ్రామికులపై కసాయి గుండెలు కత్తికట్టాయి. వారి బ్రతుకులను కొల్లగొట్టాయి. పై సంఘటనల సారాంశమే ''చిల్లర దేవుళ్లు'' నవల. దాశరధి రంగాచార్య రచించిన ఈ నవలను వరంగల్ వాస్తవ్యులు శ్రీ కాకతీయ పిక్చర్స్ పతాకం క్రింద అదే పేరుతో చిత్రంగా నిర్మిస్తున్నారు.

### మా మ, ల కలయిక

ఈ చిత్రానికి టి. మాధవరావు (''కన్నతల్లి'' దర్శకుడు) దర్శకుడైతే, మహదేవన్ సంగీత నిర్దేశకుడు. ఇటీవల వీరిద్దరూ కల్సి పై చిత్రం తాలూకూ ఈ క్రింది పాటలను వాహినీలో రికార్డు చేసారు. ''అబ్బరి బొమ్మా జరా సూసుకోని తిరుగమ్మా'' అనే పాటను సుశీల, ''గుడిసెనక గుడిసె దాన'' అనే పాటను రామకృష్ణ పాడారు. మొదటి పాటను రమాప్రభపై, రెండో పాటను నూతన నటుడు ఎ రామకృష్ణరావు, సర్తకి టి. రాజేశ్వరిల మీద చిత్రీకరిస్తారు. నవంబరు ఒకటి నుండి నెలాఖరు వరకు వరంగల్లు ప్రాంతాల్లో, డిశంబరులో సారధీ స్టుడియోలో షూటింగ్ జరపదలచినట్టు మాధవరావు చెప్పారు. నూతన నటీనటులు ఎం. వినయకుమార్, కుమారి ఉమాభారతి, పాత నటీనటులు ప్రభాకరరెడ్డి, సావిత్రి, కాంచన, రమాప్రభ, త్యాగరాజు, ముఖ్య పాత్రలను పోషించే ఈ చిత్రానికి కథ, మాటలను దాశరధి రంగాచార్య, ఫోటోగ్రఫీని యోగానంద్, ఆర్టును చంద్ర, నిర్వహిస్తున్నారు.

### కృష్ణంరాజును కవ్వించిన కాంచన

మనస్థిమితం లేనపుడు మగవాడు మందు పుచ్చుకోవడమో లేక మగువ చెంతకు చేరడమో జరుగుతుంటుంది సహజంగా. కృష్ణంరాజు మనస్సుకు బలమైన గాయం తగిలింది. ఫలితంగా అతని మనస్సు వికలమైంది. అశాంతితో, నిరాశతో నిండిన అతని మనోగమనం జూనియర్ కాంచన ఇంటికి పయనమైంది. వేదనతో వచ్చినవారికి వేడుకను చేయడమే తమ వృత్తిధర్మంగా భావించే జూ. కాంచన తన పరువపు పొంగులను ప్రదర్శిస్తూ, అతనిలో వేడి పుట్టించాలని ప్రయత్నిస్తూ ఇలా పాడింది.

''నువ్వెందు కొచ్చావో నాకు తెల్సు
నీకేమి యివ్వాలో నాకు తెల్సు'' అంటూ

కైపుగా నాట్యం చేసింది. కృష్ణంరాజు, కాంచన పొంగులకు పొంగిపోయాడా లేక ఇంకా వేదనతో కృంగిపోయాడా అని తెల్సుకోవాలంటే ధృవ చిత్ర వారి ''చిన్ననాటి కలలు'' చిత్రం చూడాలి. తమ్మారెడ్డి కృష్ణమూర్తి సమర్పణలో, టి. భరద్వాజ, ఇ. ఎస్. రెడ్డిల నిర్మాణంలో తయారయ్యే ఈ చిత్రానికి టి. లెనిన్‌బాబు దర్శకుడు.

భీశెట్టి కథకు పినిశెట్టి మాటలను, చలపతిరావు సంగీతాన్ని, వి. యస్. ఆర్. కృష్ణారావు ఛాయను, వి. కృష్ణమూర్తి కళను, ఆదుర్తి హరనాథ్ కూర్పును సమకూర్చిన ఈ చిత్రంలో గుమ్మడి, అల్లు రామలింగయ్య, రావు గోపాలరావు, కె. వి. చలం, జయంతి, ప్రమీల, రమాప్రభ, పుష్పకుమారి, ఝూన్సి, సుజాత ప్రధాన పాత్రలను పోషించారు. మైసూర్ స్టుడియోలో తీయబడిన ఈ చిత్రం లక్ష్మి విడుదల.

* * *

విజయదశమినాడు. డాక్టర్. నాయర్ రోడ్డులోని పదవ నెంబరు ఋల్లు పదికార్లతో మూగియున్న దెందుకో తెలుసుకుందామని లోనికి వెళ్లాను. ఆజాను బాహుడైన మల్లెమాల సుందర రామిరెడ్డి ఒక పాటను ఆలాపిస్తున్న నిజాన్ని చూశాను. ఆ పాటను వినడానికి వచ్చిన వాళ్ల సంఖ్య మూడు పదులు దాటింది.

మంచిరోజు అవడంచేత, తను నిర్మించబోయే కొత్త చిత్రానికి ఆయనొక పాట రాశారు. అదేమిటన,

''ఈయాల మనకంతా పండగ
ఏటికి సిరొచ్చింది దండిగ
పట్టు పంచె పంచాంగం బాపనయ్యది
గల్లకోక పూటకూళ్ల గౌరమ్మది''. ఇది



''పరివర్తన''లో శ్రీధర్, జమున

చాకి రేవు పాట. చాకిరేవుకాడ గుడ్డలుతుకుతూ సంబర పడుతూ పాడే యీ పాటను హీరోయిన్ పాడుతుందని నిర్మాత ఎస్. ఎస్. రెడ్డి చెప్పారు. సత్యం సంగీత సారథి. చిత్రం పేరు ఏమిటని అడిగాను.

### "దొరలు - దొంగలు"

అని చెప్పారు. సుందరం మూవీస్ నిర్మిస్తున్న వీరోచిత వర్ణచిత్ర మిది. జనవరినుంచి షూటింగు ఆరంభం. ఇదయిన తరువాత శోభన్ బాబుతో వర్ణ చిత్రం ప్రారంభమవుతుందన్నారు, రెడ్డిగారు.

### "తల్లి - బిడ్డ"

అక్కడే ఉన్న పద్మనాభరావు తన వర్ణ చిత్రం "తల్లి—బిడ్డ" కు కౌముదీ ఆఫీసులో అంకురార్పణ చేశారన్న వార్తను ఆయనద్వారా తెలుసుకొన్నాను. బ్యానర్ పేరు చిత్రకళా పరిషత్తు అని చెప్పారు.

"ప్రేమ, వాత్సల్యం మానవుడికి మాత్రమే సొంతము కాదు ... అవి జీవకోటి అంతటికీ అర్పితము" అన్న అంశంపై 'తల్లి—బిడ్డ' కథను అల్లినట్లు దర్శకుడు పద్మనాభరావు చెప్పారు. కథ తనదే. నిర్మాత తనే. ఛాయా గ్రహణాన్ని కె. ఎస్. ప్రసాద్, సంగీతాన్ని పెండ్యాల నిర్వహిస్తారు.

ఈ పద్మనాభరావు ఇప్పటి వ్యక్తి కాదు. "అక్కా—చెల్లెళ్ళు, బావా—మరదళ్ళు" యీయనవే. "శ్రీదేవి, రామయతండ్రి" కథలు యీయనవే. చాలా కాలం తరువాత నిర్మాణం పైనా, దర్శకత్వంపైన మక్కువ ఏర్పడడానికి కారణం అడిగాను.

ఎన్నాళ్లనుంచో తీయాలని ఉన్నదని, కథ ఇప్పటికి తను వూహించిన పద్ధతిలో వచ్చిందని, తన భావాలను సక్రమంగా చెప్పే శక్తి తనకు వుండగలదన్న ఆశాభావమే దర్శకత్వానికి పురి కొల్పిందని చెప్పారు.

### "దూరపు కొండలు"

"సత్యానికి సంకెళ్లు" చిత్రాన్ని అందించిన లక్ష్మి చిత్ర అధినేతలు నిర్మించబోయే రెండవ చిత్రం యిది. ఈ చిత్రం "అక్కరై పచ్చై" పేరిట తమిళదేశంలో అఖండ విజయాన్ని సాధించింది.

తెలుగు చిత్రానికి సత్యానంద్‌ను రచయితగా, చక్రవర్తిని సంగీత దర్శకుడిగా నియమించారు. దర్శకత్వం కె. బాపయ్యకు యివ్వబడింది.

### బాపయ్య భవిష్యత్తు

ఈ తరం దర్శకుల పట్టీలో బాపయ్యకు ప్రాముఖ్యతవున్న స్థానం వున్నది. స్వయం కృషితో యింతటి వాడయ్యాడు బాపయ్య. చురుకైన, వుత్సాహ భరితమైన మేధస్సు వున్నదీయనకు. ఇప్పుడీయన 'వూర్వశి' చిత్రాన్ని పూర్తి చేశారు. చిత్రం చూసిన ప్రతి వ్యక్తి బాపయ్యను "భేష్" అన్నారు. ప్రస్తుతం బాపయ్యకు వచ్చిన కొత్త చిత్రాలు: సురేష్ మూవీస్ వారి 'శాంతినికేతన్', వైజయంతీ మూవీస్ వారి తొలి చిత్రం, రామకృష్ణ ఆర్ట్సువారి తొలి చిత్రం, లక్ష్మి చిత్రవారి రెండవ చిత్రం. భవిష్యత్తు వున్న వివేకి యీ బాపయ్య.

### కవిత ఆత్రేయ సొంతము !

ఈ మధ్య దర్శకుడు బి. వి. ప్రసాద్ తనచేత నున్న టేప్ రికార్డర్ని ఆన్ చేసినప్పుడు, చక్రపాణి మూవీస్‌వారి "మా యింటి దేవుడు" చిత్రం తాలూకు పాటలు వినిపించాయి. విన్న నాలుగు పాటలు బాగున్నా, మహాకవి ఆత్రేయ రాసిన గీతం అత్యద్భుతంగా వున్నదనిపించింది.

"నవ్వుతున్నాను నా రాత చూచి
ఆ రాత రాసినవాడ్ని చూచి
నవ్వులోనే ఏడుపుందని
ఏడ్చినా కన్నీళ్లు రావని" — ఈ పాటను

ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం ఎంత గొప్పగా పాడారంటే, (పాఠకులు అపార్థం చేసుకోకపోతే) "ప్రేమ నగర్"లో "మనసు గతి యింతే" పాటంత అని చెప్పడానికి సంతోషిస్తున్నాను.

ఇట్టి కవితా ధనము ఒక్క ఆత్రేయకు మాత్రమే సొంతము అనిపిస్తుంది. "మా యింటి దేవుడు" వర్ణ చిత్రం దాదాపు పూర్తయింది. నటి విజయలలితకు విశేష గౌరవాన్ని తెచ్చిపెట్టే పాత్రను ఆమె పోషిస్తున్నది. నిర్మాత జయరామిరెడ్డి స్టుడియో ప్రమేయం లేకుండా నిర్మిస్తున్న చిత్రం యిది.

### రక్తం ఒక్కటే అయినా, వ్యక్తిత్వం వేరు

అయిదు వ్రేళ్లు ఒకటిగా వుండనట్లు, ఒకే రక్తం పంచుకుపుట్టిన పిల్లలు గూడా ఒకటిగా వుండడం సాధారణంగా జరగదు. అలవాట్లలోనూ, అభిప్రాయాల్లోనూ తేడాలు కన్పిస్తాయి. ఈ నైజాన్ని "అన్నదమ్ముల కథ" చిత్రం ద్వారా ప్రస్ఫుట పరుస్తున్నారు నటుడు బాలయ్య. నీతి, నిజాయితీ, న్యాయం, ధర్మం, సత్యం పంచ ప్రాణాలుగా భావించే అన్న సత్యంగా బాలయ్య నటిస్తే, వంచనతో, వక్ర మార్గాలతో పేరు సంపాదించాలని పేరాశపడే తమ్ముడిగా నూతన నటుడు సత్యేంద్ర కుమార్ నటిస్తున్నాడు. ఉత్తర, దక్షిణ ధృవాలెలా



"ఆడవాళ్లు—అపనిందలు"లో జయంతి, సత్యప్రియ

ఒకదాని కొకటి విరుద్ధమో, వీరిద్దరి గుణాలకంత విభేదం.

### శ్రీశైలంలో మకాం

'అన్నదమ్ముల కథ' తాలూకు అవుట్‌డోర్ చిత్రీకరణ కోసం నవంబరులో శ్రీశైలానికి తరలి వెళుతోంది అమృతా ఫిలిమ్స్ యూనిట్. ముఖ్యమైన కొన్ని సన్నివేశాలను అక్కడ షూట్ చేయదలచినట్లు నిర్మాతలు అలపర్తి సూర్యనారాయణ, మన్నవ వెంకట్రావు చెప్పారు. 'సగం చిత్రానికి పైగా అయిపోయింది, మిగిలిన ఆ కొంత వర్కు త్వరలో పూర్తి చేసి డిశంబరులో విడుదల చేయాలనుకుంటున్నాము' అన్నారు చిత్ర కథకుడు బాలయ్య. శ్రీ ఫిలింస్ పంపిణీ చేసే ఈ చిత్రానికి డి. ఎస్. ప్రకాశరావు దర్శకుడుగానూ, రాజేశ్వరరావు సంగీత దర్శకుడిగానూ, బి. రామచంద్రయ్య ఛాయాగ్రాహకుడిగానూ, వీరప్ప ఎడిటరుగానూ పని చేస్తున్నారు. ప్రభ, రోజారమణి, పండరీబాయి, సుజాత, రావు గోపాలరావు, చంద్రమోహన్, రావి కొండలరావు, సాక్షి రంగారావు, మిక్కిలినేని, మోదుకూరి సత్యం, కె. కె. శర్మ, ఇంద్ర ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు



"దేవదాసు"లో కృష్ణ, జయంతి

## మోసపోయిన అబల లత !

లేత వయసుల లత సత్యనారాయణను ప్రేమించింది అతన్ని గాఢంగా నమ్మింది అతను చెప్పిన మాటలకు తలవూపింది అతను చేసిన చేష్టలకు లొంగిపోయింది ఆఖరుకు తన శీలాన్నే అర్పించింది అతనితో తనకు పెండ్లి జరుగుతుందని పొంగిపోయింది ఒకనాడు సడెన్‌గా సత్యనారాయణ రూమ్‌లోకి ఉడుగుపెట్టింది అక్కడ అతని రాస క్రీడలు చూచి, రుద్రకాళి అయింది ఆత్రంతో, ఆవేశంతో తూలనాడింది కానీ అందుకతనిలా బదులిచ్చాడు

సత్యా నా డబ్బుతో అందాల్ని, ఆనందాన్ని కొనుక్కుంటున్నాను చూడు ! నువ్వు రోజుకో చీర మార్చుకోవడంలేదూ నేను ఆడవాళ్లను మార్చుకుంటున్నాను అంతే చూడు మీనా ! ఒక్క పెళ్లి విషయం తప్ప, నాదగ్గర నీకు ఏం కావాలన్నా దొరుకుతాయి ఎప్పుడు రావాలన్నా రావచ్చు — పోవచ్చు — సరా ! అన్నాడు

లత · యూ డెవిల్ ! నీలాంటి వంచకుడ్ని ఏం చేసినా పాపంలేదు నా వుసురు నీకు తగలకుండా పోదు నువ్వు సర్వనాశనమైపోతావు ముమ్మాటికి సర్వనాశనమైపోతావ్ ! అంటూ చరచరా వెళ్లిపోయింది లత కట్ అన్నారు దర్శకుడు వీటూరి ఈ రసవత్తర ఘట్టం మనోరంజనీ పిక్చర్స్ వారి "భారతి" చిత్రంలో చోటుచేసుకుంది. కె వి రెడ్డి ఈ చిత్రానికి నిర్మాత ఈ చిత్రంలో శీలవతిగా, పతి సేవాపరురాలిగా జమున వున్నతంగా నటిస్తున్నది యస్వీ రంగారావు వేసిన ఆనంద రామయ్య పాత్రను మరొకరు చెయ్యగలరా ? ఇందులో పద్మనాభం సీరియస్ రోల్ ధరించారు ఈ చిత్రం త్వరలో విజయా కంబైన్స్ ద్వారా విడుదలవుతుంది

# సినిమా

## సత్యనారాయణ సీజన్ !

ఇప్పుడొస్తున్న చిత్రాలను పరిశీలిస్తే, క్యారెక్టర్ నటుడు సత్యనారాయణ సాధించిన ప్రగతి ప్రస్ఫుటమవుతుంది

ఈమధ్య విడుదలయిన "నిప్పులాంటి మనిషి"లో షేర్‌ఖాన్ పాత్ర, "దొరబాబు"లో భుజంగం పాత్ర, "సత్యానికి సంకెళ్లు"లో అయిదు వేళ్ల చిదంబరం పాత్ర ప్రేక్షకులను ఎంతగా ఆకర్షించాయో పాఠకులకు తెలియదా ?

ఇకముందు రాబోయే చిత్రాలలో "ఎవరికివారే యమునా తీరే"లో జమిందారు వేషం, "రామయ్య తండ్రి"లో హీరో వేషం, "చదువు — సంస్కారం"లో కథానాయకుడి వేషం ప్రజలలో యితడికి వున్న పలుకుబడిని యినుమడింపచేస్తాయి

పరిశ్రమలో అందరిచేతా మంచివాడు అనిపించుకుంటూ, అందరినీ సంతృప్తిపరుస్తూ యిక్కడివాళ్ల గౌరవాన్ని, వెరైటీ వేషాలలో విశిష్టమైన నటన్ను చూపెట్టి అక్కడివాళ్ల ఆశీర్వాదాన్ని పొందుతున్న కైకలూరి సత్యనారాయణకు మరొక దశాబ్దం వరకు తిరుగులేదు. ఏ వేషాన్నయినా చెయ్యగల ఏకైక నటుడు ఎవరయ్యా అంటే ఒక్క సత్యనారాయణే అనేది భావం అందరికీ వున్నది.



"రాముని మించిన రాముడు"లో

## పూర్ణిమా చిత్రం ప్రారంభం

కన్నడంలో ఢంకా మ్రోగించిన "బంగారద మనుష్య" చిత్రాన్ని తెలుగులో పూర్ణిమా పిక్చర్స్ పతాకం క్రింద డి ఎన్ రాజుగారు నిర్మిస్తున్నారు. ఈ చిత్రం తాలూకు షూటింగు నవంబరు 2వ తేదీ వాహినీ స్టుడియోలో ప్రముఖుల సమక్షంలో ప్రారంభమైంది. మొదటి షాటును మంజులపై చిత్రీకరించారు దర్శకుడు సి. ఎస్. రావు. హీరో కృష్ణకు పై చిత్రంలో వెరైటీ రోల్. తోబుట్టువు కోసం, ఆవిడ సంక్షేమం కోసం తన జీవితాన్నే అర్పించడానికి ఆయత్తమైన సహృదయుడి పాత్రను పోషిస్తున్నారు. కృష్ణ అక్కగా షావుకారు జానకి నటిస్తోంది.

## రా ! రా ! నా సామిరంగా !

అంటూ భలే జోరుగా, హుషారుగా పాడుతోంది మంజుల ఆ పాటలోని మాటలకు అర్థాలను ఆరా తీస్తున్నారు ప్రక్కనే వున్న హీరో కృష్ణ. వారిద్దరి వాలకాలను కెమెరాలో చూస్తూ సూచనలిస్తున్నారు దర్శకుడు సి ఎస్ రావు. ఉండబట్టలేక 'ఏమిటండీ ! వారిద్దరికి లడాయా ?' అన్నాను 'ఒక రకంగా లడాయే. కానీ అది నిజమైన లడాయి కాదు మంజుల ప్రేమ లడాయి అంతకు మునుపెప్పుడో కృష్ణ తనను నిక్కి నిక్కి చూస్తుంటే, అతని చేష్టలను అంట్లు తోముతున్న తాను స్టీల్ పాత్రలో చూచి, అతని భరతం పట్టాలనుకుంటుంది. అందుకే అదను చూచి గాలం వేసింది. పాటతో అతన్ని కంగారు పెట్టింది' అన్నారు నిర్మాత డి. ఎన్. రాజుగారు పై గమ్మత్తయిన సన్నివేశం పూర్ణిమా పిక్చర్స్ చిత్రంలో అగుపిస్తుంది. నారాయణరెడ్డి వ్రాసిన పై పాటకు మహదేవన్ పల్లవి కూర్చగా, సుశీల కమ్మగా పాడింది. నవంబరు 3, 4 తేదీల్లో అవుట్‌డోర్‌లో చిత్రీకరించారు పై పాటను.

## రారాజు క్రీస్తు

దైవ స్వరూపుడయిన ఏసుక్రీస్తు జీవిత చరితను జనతా ఆర్ట్సు థియేటర్సువారు వర్ణ చిత్రంగా నిర్మిస్తున్నారు.

ప్రేమ స్వరూపుడు, పాపాలకు శత్రువు అయిన ప్రభువు పాత్రను విజయ్ పోషిస్తున్నాడు. గెటప్‌లో దైవ అంశ వున్నట్టు రషస్ చూసినవాళ్లు అంటున్నారు. రోమన్ గవర్నర్ పైలట్‌గా జగమెరిగిన జగ్గయ్య నటిస్తున్నారు. యూరప్‌కి చెందిన హ్యూబర్టు తెలుగు చిత్రంలో సెంచూరియన్ వేషంలో అగుపిస్తారు.

ఇతర ముఖ్య పాత్రలను హరనాథ్, రాజనాల, ముక్కామల, కె. వి నాగేశ్వరరావు, నరశింహరాజు, పి ఎల్. నారాయణ, సాక్షి రంగారావు, త్యాగరాజు పోషిస్తున్నారు.

## వేశ్యగా రాజశ్రీ !

వేశ్యగా తన అందాన్ని అంగట్లో పెట్టి, డబ్బును గడించినా మనశ్శాంతి లేక, తన జీవితాన్ని ఏసు భగవానుని పాదములందు పునీతం చేసుకొన్న పరితప్త హృదయగా రాజశ్రీ నటిస్తున్నది. సహాయ భూమికలను రత్న, జయవిజయ, సలోమీ, రాణి ధరిస్తున్నారు.

ఈ చిత్రాన్ని భక్తి జనరంజకంగా, మనోరంజకంగా రూపొందించే బాధ్యతను జి. ఎస్. కృష్ణమూర్తి, క్రిష్టఫర్ కొయిలోడై కొన్నారు. ఈ చిత్రం రష్ చూసిన వ్యక్తులందరూ కెమెరామెన్ అప్పారావు పనితనాన్ని, ప్రతిభను కొనియాడారు. సికింద్రాబాదు కమ్యూనికేషన్సు సర్వీసు సెంటరు వారి సహకారంతో ఎ. ఎస్. రాజు తలపెట్టిన యీ ప్రబోధాత్మక చిత్రానికి ప్రజా రక్షణ లభించుగాక !

# సామాన్యుని సణుగుడు

**బజార్లో సరుకులు దొరక్కపోతే సూపర్** బజార్లో అమ్మించేస్తామంటారు గవర్నమెంటువారు – ఏలినవారు మారువేషాల్లో ఓ సారి సూపర్ బజారుకెళ్లి, ఫారిన్ స్టైలక్సు వద్దా పంచదారవద్దు – కేవలం, ఓ సూది కొనుక్కుంటేతప్ప, అక్కడకు వెళ్లే సామాన్యుని అవస్థ వారికి తెలీదు! ప్రజాస్వామ్య సిద్ధాంత మెంతమంచిదో సహకార రంగంలో సరుకుల అమ్మకం కూడా అంత గొప్పదేకాని అది అమలు చేయటానికి అక్కడైనా; యిక్కడైనా "పవిత్ర భారతీయు"ల మనస్తత్వమేగా ప్రబలంగా పనిజేసేదీ! వోట్లు యిచ్చి గద్దె ఎక్కించాకా అట్లా అందలంఎక్కి కూర్చున్నవాడైనా వోటర్ని కాస్త పలకరిస్తాడేమో కాని, సూపర్ బజారుల్లో–ముఖ్యంగా విజయకృష్ణ అన్న గొప్ప పేరున్న ఆంధ్రుల రెండో రాజధాని అయిన విజయవాడ సూపర్ మార్కెట్ లో మాత్రం– అమ్మకాలగుమాస్తాలుగూడా కొనుగోలుదారుని లక్ష్యపెట్టరు. వాళ్లు అర్జంట్గా ఆడామగా కలిసి లోకాభిరామాయణం చెప్పుకోవటంలో మునిగి వుంటారు. పోలీస్స్టేషన్లో మనకి వెంటనే పలికేవారుంటారేమో, రైల్వేబుకింగ్ క్లర్క్గారు రెండోసారైనా మన పిలుపుకి తలఎత్తి చూస్తారేమో, పోస్టాఫీసుల్లోను, జాతీయ బ్యాంకుల్లోను మన మొరాలకించే నాధులు కొందరైనా వుండొచ్చునేమోగానీ సూపర్ మార్కెట్వారి వుద్దేశంలో సామాన్య జనులు "మిడిల్క్లాస్ పెట్టీబూర్జువా"లు అంటే, కేవలం కార్డుపట్టుకుని సబ్బుబిళ్లకీ సవాసేరు పంచదారకీ క్యూలో నిలబడి, అయ్యా! బాబూ! అంటూ వాళ్లిచ్చిందేదో




తీసుకుపోవాల్సినవాళ్లనే అభిప్రాయం ఉన్నట్లుంది...ఒకవేళవారు మనల్ని కనికరించి పలకరించినా మనం అడిగిన సరుకు ఏదైనా దానికి జవాబు లాకేత్వం దాక్కొమ్ము మాత్రమే. సూపర్ బజార్లో కాలక్షేపం కోసం వెళ్తే అది వేరే సంగతికాని కొనుగోలుకు వెళ్తే మాత్రం అక్కడివారు కనీసం ఓజిల్లాస్థాయి అధికారి రికమండేషన్ వుంటే తప్ప–సామాన్యుణ్ణీ అతని అవసరాన్ని ఇంత పిసరు కేర్ చేయరు–సరుకు–ఏదైనా చూపించరు. అసలు బియ్యం, పంచదార, కిరసనాయిలు యిలాంటివన్నీ వాళ్ల చేతిల్లో వున్నాయి – పెట్టుబడికి "ఏలినవారున్నారు" కనుకగానీ లేకపోతే యీ సూపర్ మార్కెట్ల గతి ఏమిటీ? అంటూ గొణిగే సామాన్యుణ్ణి ఎవరూ లక్ష్యంచేయరు. అక్కడ కంప్లయింట్ బుక్లుంటే అందులోనైనా సామాన్యుడు తన మొర వినిపించుకోవచ్చునూ అంటేఅసలు సామాన్యుడి సణుగుడు ఎవడు వింటాడూ? కంప్లయింట్ బుక్కులు సామాన్యుల కెందుకు ...గొణుక్కొని వూరుకోక....

—ఒకసామాన్య కొనుగోలుదారు.

# చేయి జారిన స్వర్గం

(27వ పేజీ తరువాయి)

వున్న నాకు ఒక ఆశాజ్యోతి కనిపించింది. ఆ నాలుగువేలు నేనే సంపాదిస్తే? అందుకే కష్టపడి చదివి పట్టుదలగా ఆంధ్రామెట్రిక్ పరీక్ష వ్రాసి ఫస్ట్న పాసయ్యాను. అదృష్టం కలిసి రావడంవల్ల మంచి ఉద్యోగం దొరికింది నేను పరీక్షకు కట్టే రోజుల్లోనే నాకు టి బి ప్రారంభదశలో వుందని డాక్టరు చెప్పాడు డబ్బులేక అప్పుడు వైద్యం చేయించుకోలేక పోయాను ఉద్యోగంలో చేరాక — మందులకూ డాక్టర్లకూ పెట్టే డబ్బు మిగులుతుంది త్వరగా నాలుగువేలు జమ చేయవచ్చున్న స్వార్థంతో వైద్యం చేయించుకోలేకపోయాను. నా ధ్యేయం ఒక్కటే. ఎలాగైనా నాలుగువేలు లీసుకుని నీ వద్దకురావాలి బీటలువారిన నా సంసారాన్ని సశ్యశ్యామలం చేసుకోవాలి నా సుఖాలన్నీ చంపుకుని నా ధ్యేయాన్ని మరిచిపోకుండా రెక్కలు ముక్కలయ్యేట్లు రెయ్యింబవళ్లు వోవర్ టైం కూడా చేశాను. నా లక్ష్యం నెరవేరిందికాని నా ఆరోగ్యం పూర్తిగా ధ్వంసమయి పోయింది డబ్బు స్వయంగా తెచ్చి నీకు యిచ్చేందుకు నేను నోచుకోలేదు మామయ్యా! ఈ జబ్బు నుండి తప్పించుకోవాలని యిన్నాళ్ళ నుండి నేను ప్రయత్నించాను. ఈ రోజు దాని కోరల్లో చిక్కుకున్నాను. బతికి బయటపడతానన్న నమ్మకంలేదు మామయ్యా! అందుకే ముందుగా తీసుకున్న నాలుగువేల డ్రాఫ్ట్ పంపుతున్నాను. మళ్ళీ నిన్ను చూస్తానన్న నమ్మకం నశించడం వల్లనే రెండు నెలల క్రితమే వ్రాసిపెట్టిన ఈ ఉత్తరాన్ని ఇవాళ బయటికి తీశాను ఇలాంటిరోజు తప్పదని నాకెప్పుడో తెలుసు. కాబట్టే ముందుగానే అన్ని ఏర్పాట్లు చేశాను. డబ్బు ముట్టింది కాబట్టి నువ్వు నన్ను తీసుకెళ్లడామని వస్తే రావచ్చు. నువ్వు వచ్చేటప్పటికి నేను వెళ్లాల్సినచోటికి వెళ్ళిపోతాను. చివరిసారిగా నిన్ను చూడ్డామనుకున్న కోర్కె అత్యాశగా మిగిలిపోతోంది. అవసరమనుకుంటే బుజ్జిని తీసుకెళ్ళు. కావాలనుకుంటే మళ్ళీ పెళ్ళిచేసుకో.

—రాధ.

చంద్రం శరీరమంతా చెమటతో ముద్దయిపోయింది. భయంతో పెదాలు ఎండిపోయాయి. చేతిలోవున్న వుత్తరం ఎండుటాకులా చప్పుడు చేసింది. కవర్లో మిగిలిపోయిన నాలుగువేల రూపాయల డ్రాఫ్ట్ రాధ మృత్యువు తాలూకు ఎక్నాలెడ్జిమెంటులా అనిపించింది.

"రాధా! ఎంతపని జరిగిపోయింది?" అంటూ రెండు చేతులతో తలపట్టుకుని కుర్చీలో కూలబడ్డాడు. చేసిన పొరపాట్లు ఛెళ్ళున కమ్చీ దెబ్బలా తగిలినట్లు అనిపించసాగింది. అర్థంలేని తనపట్టుదలకోసం రాధ తన జీవితాన్నే బలిపెట్టి చివరికి అనుకున్నది సాధించింది. చదువూ సంస్కారం వుండికూడా తను పశువులా ప్రవర్తించాడు. పశ్చాత్తాపంతో కుమిలి కుమిలి లోలోపల ఏడ్చాడు చంద్రం. తనకు నిష్కృతి లభించాలంటే రాధ పాదాలమీద పడడం ఒక్కటే మార్గం అనుకున్నాడు.

ఇంటికి తాళంవేసి రిక్షాలో స్టేషన్ కు వెళ్ళాడు.

రాధను చివరిసారిగా చూసుకోవాలన్న ఆరాటం అతని గుండెల వేగాన్ని రెట్టింపు చేస్తోంది. రాధను క్షమాభిక్ష కోరాలని గంతులువేస్తున్న మనసును అదుపులో పెట్టుకుని ప్లాట్ఫారం మీదకువచ్చాడు.

అప్పటర్ సిగ్నల్ను దాటి వెళ్ళిపోయింది. చంద్రం ఎక్కాల్సిన మెయిల్.

రాధ పంపిన కవరు చేతిలో పట్టుకున్న చంద్రం ప్లాట్ఫారం మీద ఒంటరిగా మిగిలిపోయాడు. (అయిపోయింది)

# పట్టుచీర



దీపావళి కథల పోటీలో
రు. 750 లు
బహుమతి పొందిన కథ

ఏడేళ్ల వయసప్పుడు దుర్గ అమ్మా, నాన్నలతో కలిసి సినీమా కెళ్లింది. అదొక పురాణ గాథ. పైగా రంగుల్లో తీసారేమో దుర్గకి ఆ సినీమా నచ్చింది. అంతకన్నా ఆ సినీమాలో సీత పాత్రధరించిన ఆవిడ కట్టుకున్న పట్టుచీర మరీనచ్చింది అందమైననీలంరంగుపట్టుచీర. చాలా చాలా నచ్చింది. అందుకే తల్లి నడిగింది :

"అమ్మా! నాకూ అటువంటి చీరకొనవే."

పక్కసీట్లో ఉన్నావిడ ఎవరో గట్టిగా నవ్వింది. "ఉష్. గట్టిగా అరవకు" తల్లి మందలింపు.

దుర్గ అప్పటికి ఊరుకుంది.

సినీమా అయిన్తర్వాత మళ్లీ అడిగింది రిక్షాలో :

"అమ్మా! నాకూ కొనవే అలాటి చీరా?"

"ఏమిటే? చంపేస్తున్నావ్, జిడ్డిముండా. పిచ్చిగానీ ఎత్తిందేమిటి?" విసుక్కుంది తల్లి.

దుర్గ ముఖం చిన్నబోయింది.

"ఎందుకు పార్వతీ దాన్ని కసుర్తావ్? దానికేంతెలుస్తుంది?" అని ఆవిడని మందలించి, "చూడమ్మా దుర్గా! నువ్విప్పట్నుంచి చీర కట్టుకోకూడదు. ఆ చీరేమో చాలా పెద్దది. మరి నువ్వేమో యింకా చిన్నదానివి. నీ కెలా సరిపోతుంది చెప్పు ?" అన్నాడు దుర్గ తండ్రి లాలసగా.

దుర్గ కొంచెంసేపు ఆలోచించి —

"మరైతే నేనెప్పుడు కట్టుకుంటా న్నాన్నా ఆ చీరా" ఆతృతగా అడిగింది.

"యింకో పదేళ్లు పోవాలి. అప్పుడు నువ్వు పెద్దయి పోతావ్ కదా, అప్పుడు నీకూ పెళ్లవు

తుంది కదా? అప్పుడూ...''అని తండ్రి నవ్వేడు.

''ఫో నాన్నా!''అని సిగ్గుపడింది ఏడేళ్ల దుర్గ.

* * *

దుర్గతో బాటు కోరిక కూడా పెరిగింది. దుర్గ కోరికకి పదేళ్ల వయసొచ్చింది. దుర్గకి పట్టుచీర కట్టుకునే వయసొచ్చింది అందుకే...

అక్క పెళ్లిలో అడిగింది మళ్లీ:

''అమ్మా! నాకూ అటువంటి పట్టు చీర కొనవే?''

పిల్లలు ఎంత పెద్దవాళ్లయినా, తమ కన్న వారిదగ్గర పసిపిల్లలే! మారాంచేసి మరీ తమ కోరిక తీర్చుకుంటారు. అయితే ఆ కోరిక తీరడానికి పేదరికం అడ్డొస్తే?...

''ఆ. కొంటాం తల్లీ. ఈ మాత్రం తింటున్నందుకే సంతోషించాలి. అయినా నీ పెళ్లి కెలాగూ కొనాలిగా.''అంది తల్లి.

దుర్గకి మళ్లీ సిగ్గు వచ్చింది. అంతే కాకుండా కోపంకూడా వచ్చింది.

''ఏంటమ్మా! ఏదడిగినా పెళ్లకి కొంటా నంటావ్?'' అంది.

''ఇప్పుడు అల్లరి పెట్టకు తల్లీ. బోల్డు పనులున్నాయి. చిన్నపిల్లవేం కాదు''అంది ఆవిడ వెళ్లిపోతూ

దుర్గ మనసులో యింకా ఆ పట్టుచీరే మెదుల్తోంది.

''అక్కకి కొన్న పట్టుచీర యెంత బావుంది? నీలంరంగు మీద పెద్దపువ్వులు వెండిలా మెరుస్తున్నాయి. నిజంగా చాలా బాగుంది. నాకూ అలాటి చీర ఉంటే బాగుణ్ణు. పోనీ ఒక్కసారి కట్టుకుని మళ్లీ అక్కకి యిచ్చేస్తానంటే? అమ్మో! యింకే మన్నా ఉందీ? అమ్మ చంపేయదూ? ... మరెలా నేనూ పట్టుచీర కట్టుకోవడం?... నాన్ననడిగితే?... అవును నాన్నయితే తప్పక కొంటారు. అమ్మయితే ''యిప్పుడెందుకు? డబ్బుల్లెండగ. నీ పెళ్లి కెలాగూ కొనాలిగా'' అంటుంది. అమ్మకేం తెలీదు. నాన్ననే అడుగుతాను.''

తిన్నగా తండ్రి దగ్గరకు వెళ్లింది దుర్గ.

''ఏమ్మా! కొత్తచీర కట్టుకోలేదు యింకా యీ చీరతోనే ఉన్నావేం?'' అన్నాడాయన.

''నేనా చీర కట్టుకోను.'' తల దించుకుని జవాబు చెప్పింది, కళ్లలో కోపాన్ని చూపిస్తూ.

''ఏం?'' అన్నాడాయన, దుర్గ కళ్లలోకి పరీక్షగా చూసి.

''దానికాచీర అక్కర్లేదుట. పట్టుచీర కొంటేగాని కట్టదట మహారాణి.'' అంది దుర్గతల్లి లోపలకు వస్తూనే, విసుగ్గా.

దుర్గకి కోపం వచ్చింది.

''ఏం? అక్కకి కొన్నారుగానీ, నాకు కొన్లేరేంటి? అన్నీ దానికే కొంటారు.'' అంది ఈర్ష్యగా.

దుర్గ తల్లి యేదో అనబోయింది. కానీ దుర్గ తండ్రి ఆమెను వారించాడు.

''చూడు దుర్గా! మీ అక్క మరో ఇంటి కెళ్తోంది. మరి దానికి కొత్త బట్టలు ఉండద్దా? నీకూ కొన్నాళ్లకి పెళ్లవుతుంది. అప్పుడు నీకూ కొంటాం. యేం?'' అన్నాడాయన.

''ఫో నాన్నా! నువ్వూ యిలాగే అంటావ్.'' దుర్గ విసుక్కుంది.

''అదికాదమ్మా! యిప్పుడు ఉన్నపళంగా పట్టుచీరకొని తెమ్మంటే ఎక్కడ నుండి కొని తేగలను చెప్పు? నా పరిస్థితి కూడా కొంచెం ఆలోచించు. నేను సంపాదించేదెంతో నీకు తెలుసు కదా? ... '' అని కూతురు ముఖంలోకి చూసేడు.

తండ్రి మనసు కష్టపెట్టినందుకు బాధపడి తల దించుకుంది దుర్గ. ఆయన కూడా అది గమనించి—

''సరేలే అవన్నీ యిప్పుడెందుకు? నీకూ తొందరలోనే ఓ పట్టుచీర కొంటాను. ఏమ్మా?''అన్నాడాయన.

''నీ యిష్టం నాన్నా!'' అంది దుర్గ మరేమనాలో తోచక.

అసలు అంతకంటే మరేం అంటుంది? ఆమె పెరిగిన వాతావరణమే అటువంటిది ఎప్పుడూ తండ్రి తెచ్చిన బట్ట కట్టుకోవడమే తప్ప. నాకిది కావాలని ఆమె యేనాడూ కోరలేదు. కానీ యీసారి అలా అడిగి తండ్రి మనసుని బాధపెట్టి నందుకు, ఆమె కూడా బాధపడింది. మరెప్పుడూ అడగకూడదను కుంది ...

అయితే ఆరోజు తప్పకుండా వస్తుందనీ, తను తప్పకుండా పట్టుచీర కట్టుకుంటుం దనీ దుర్గ యెన్నో ఆశలు పెంచుకుంది ...

అసలు ఒక విధంగా చెప్పాలంటే ఆమె కోరికేం గగనకుసుమం కాదేమో! ఆ కోరిక ఎలాగేనా తీరుతుందను కుందామె. కాని ఆమె విషయంలో ఆ కోరిక గగన కుసుమమే అయింది. అన్నీ మనం అనుకున్నట్టు జరగవు కాబట్టే యిది జీవితం. దుర్గ తండ్రి మరికొన్ని సంవత్సరాలు బతికిఉంటే ఆ కోరిక తీరేదేమో!... కానీ అలా జరగ లేదు ఆయనకి ఓ రోజు హఠాత్తుగా గుండెల్లో నొప్పి వచ్చింది. విపరీతమైన నొప్పి. ఆ నొప్పి ఆయన భరించలేక పోయేరు. డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్లేరు. అయితే ఆయనకి డాక్టర్ అవసరమే లేకపోయింది. రిక్షాలోనే ఆయన గుండె ఆగి చచ్చిపోయేడు.

అంతే! ఆ తర్వాత ఆయన భార్యా, పది హేనేళ్ల కొడుకూ, దుర్గా ఒంటరి వాళ్లయి పోయేరు. దుర్గ తల్లికి హఠాత్తుగా ఎదురైన యీ పరిస్థితి తట్టుకోలేనట్టు చేసింది. ఫలితంగా ఆవిడ మంచం పట్టింది. యింక మిగిలిన ఒక్క కూతురికీ పెళ్లి చెయ్యలేదనే ఆవిడ బాధంతా. ఆవిడ పరిస్థితికి జాలిపడి, ఆవిడ అన్నయ్య తన కొడుకు విశ్వనాథంకి దుర్గను చేసుకుంటానన్నాడు. ఆవిడ ఆ మాటకి యెంతో సంతోషించింది. తనింక నిశ్చింతగా చచ్చిపోవచ్చుననుకుంది. కూతురు పెళ్లికూడా చూసి చచ్చిపోదామని ఆశపడింది. అయితే ఆ ఆశ తీరకుండానే ఆవిడ చచ్చి పోయింది.

దుర్గ మేనమామ కూడా ఏమంత డబ్బు కలవాడుకాదు. అతని సంసారం కూడా మధ్య తరగతికి చెందినదే! అయినా చెల్లెలికిచ్చిన మాటను నిలబెట్టుకోడానికి, మరునటి సంవత్సరమే విశ్వనాదంకి దుర్గనిచ్చి పెళ్లి చేసేడు. పెళ్లి ఏం అంత ఆడంబరంగా జరగ లేదు. తల్లి చనిపోవడంతోనే తన కోరికలన్నీ చంపేసుకుంది దుర్గ. తన జీవితం యీ విధంగా ఒక యొడ్డుకు చేరినందుకు ఆమె సంతోషించింది. దుర్గ పెళ్లి, దుర్గ పట్టు చీర కట్టుకోకుండానే జరిగిపోయింది. భర్తకి వచ్చే కొద్దిపాటి జీతంతోనూ ఖుల్లు గడవ డమే కష్టంగా ఉండేది ఆ పరిస్థితులలో. మిగిలిన కోరికలకి తావెక్కడ ఉంది? అందుకే దుర్గ తన కోరిక లన్నీ లోపలే దాచేసుకుని, సంసార సాగరంలో పడింది. కాలచక్రం పరుగులో యిరవైయేళ్లు వెనక్కి వెళ్లి పోయేయి. ఈ యిరవైయేళ్ల కాలంలోనూ దుర్గ అత్తమామలు చనిపోవడం, కొడుకు అనంత్ చదువు పూర్తిచేయడం, కూతురు పద్మ పెళ్లికెదిగి కూర్చోడం, జరిగింది

# పట్టు చీర

అయినా ఆమె కోరిక మాత్రం తీరలేదు !

* * *

"అమ్మా ! నాన్నా!" సంతోషంగా కేకలు వేస్తూ యింట్లోకి వచ్చేడు అనంత్.

వంటింట్లో ఉన్న దుర్గమ్మ కంగారుగా వచ్చి —

"ఏమిటా బాబూ ! అలా కేక పెట్టావ్. ఏమైంది ?" అని ప్రశ్నించింది.

"నాకు యల్ ఐ సి. లో ఉద్యోగం వచ్చిందమ్మా! ఎల్లుండి పదిహేనో తారీఖున వచ్చి జాయినవమని ఆర్డర్సు వచ్చేయమ్మా." ఆనందంగా అన్నాడు అనంత్.

"ఎంత చల్లని వార్త వచ్చిందిరా! ఆ భగవంతుడిన్నాళ్లకి మనని దయ చూసేడండీ." అంది దుర్గమ్మ.

అవును. చదువు పూర్తిచేసిన రెండేళ్లకి గానీ ఉద్యోగం దొరక్కపోతే అలా అనిపించడం ఎవరికైనా సహజమే !

"నే చెప్పలేదు దుర్గా! ఆ ఉద్యోగం వీడికి తప్పకుండా వస్తుందని." అన్నాడు విశ్వనాథం.

"ఇదంతా మీ ఆశీర్వాదం నాన్నా" అని అనంత్ తల్లిదండ్రులకాళ్లకి నమస్కరించేడు.

"వెయ్యేళ్లు వర్ధిల్లు బాబూ ! త్వరలోనే ఓ యింటి వాడివై పిల్లా పాపలతో కలకాలం సుఖంగా వర్ధిల్లు" అని ఆశీర్వదించింది దుర్గమ్మ.

విశ్వనాథం మనసులోనే అనంత్‌ను దీవించేడు.

"అన్నట్టు పదిహేనో తారీఖున కదూ వచ్చి చేరమన్నది?" విశ్వనాథం అడిగేడు.

"అవున్నాన్నా,"

"అంటే సోమవారం అన్నమాట. యింకా రెండు రోజులే ఉంది" దుర్గమ్మ బెంగగా అంది.

"ఇంతకీ ఏ ఊరో చెప్పావ్ కాదేం?" విశ్వనాథం అడిగేడు.

"రాజమండ్రి నాన్నా"

"పోనీలే. యీ నాటికేనా నీకు ఉద్యోగం వచ్చేసింది అంతే చాలు" అంది దుర్గమ్మ.

"దుర్గా! వడ్డించెయ్. ఆఫీసుకి టయిమవుతోంది" అన్నాడు విశ్వనాథం.

"రండి. మీదే ఆలస్యం. ఏరా! నువ్వు కూడా భోజనం చేస్తావా ?"

"యిప్పట్నుంచి వద్దమ్మా! నా ఫ్రెండ్స్‌ని కలిసి వస్తాను. పద్మలో తింటాన్లే" అన్నాడు

"సరే. నీ యిష్టం. నువ్వెప్పుడు తింటానంటే అప్పుడే పెడతాను."

అనంత్ బయటకు వెళ్లిపోయాడు. అనంత్ వెళ్లినవేపుచూస్తూ దుర్గమ్మ అంది. "హమ్మయ్య! ఇన్నాళ్లకి హాయిగా ఉండండి. వాడికి ఉద్యోగం వచ్చింది. యిక మనం సుఖంగా ఉండొచ్చు"

"సంతోషానికేంగాని, వడ్డించు" అన్నాడు విశ్వనాథం నవ్వుతూ.

ఆ రోజు భోజనందగ్గర విశ్వనాథం ఎక్కువగా తినడంలేదు

"కూర కూడా కొంచమే తిన్నారు మజ్జిగలోకి అన్నం వేస్తాను" అంది దుర్గమ్మ

"వద్దు దుర్గా! కడుపు నిండిందిప్పటికే"

"ఏమండీ ! కొడుక్కి ఉద్యోగం దొరికిందన్న ఆనందంతోటే కడుపు నిండి పోయిందేమిటి ?"

విశ్వనాథం భార్య ముఖంలోకి చూసేడు.

* * *

అనంత్ ఉద్యోగంలో చేరి నెల రోజులు గడిచిపోయేయి.

"పోస్ట్ !" అన్నకేక వినిపించింది.

భోజనానికి కూర్చోబోతున్నదల్లా ఆగి, వెళ్లి కవరుతీసుకుని పరిశీలనగా చూసింది. ఆ ఉత్తరం అనంత్ రాసిందేనని దస్తూరీ చూడగానే పోల్చుకుంది దుర్గమ్మ. ఆత్రుతగా ఉత్తరం చదివింది.

మ. రా. నాన్నగారికి,

నమస్కారములు. నేను క్షేమం. అక్కడ మీరూ, అమ్మా, పద్మా క్షేమమేనని తలుస్తాను. నేను నిన్ననే నా మొదటి నెల జీతం అందుకున్నాను. ఆ డబ్బుతో మీకు ఓ పంచె, అమ్మకి ఓ పట్టు చీరా, పద్మకి ఓ చీరా తీసుకున్నాను. అమ్మకి కొన్న పట్టు చీరను యిన్‌స్టాల్‌మెంట్సు మీద తీసుకున్నాను. అంటే యీ నెల యాభై రూపాయలిస్తే, మిగతా డబ్బులో మరో యాభై రూపాయలువచ్చే నెల యివ్వాలి. అమ్మచీర రెండువందల తొంభై రూపాయలయింది. ఆ చీర చాలా బాగుంది.

నా ఉద్యోగం కూడా బాగానే ఉంది. ఎక్కువ కష్టపడనక్కర్లేదు. యిక్కడ నేనూ, మరో ఫ్రెండూ ఒకే రూమ్ తీసుకుని అందులోనే ఉంటున్నాము. రూమ్ బాగానేవుంది. యిక్కడ హోటల్ భోజనం

ఫర్వాలేదు. యింతే సంగతులు. యీ నెల పదిహేడవ తారీఖున మన ఊరు వస్తున్నాను. అమ్మకి నా నమస్కారములు. పద్మని అడిగేనని చెప్పండి. పరీక్షలకు బాగా చదువుతూందని తలుస్తాను. ఉంటాను. అనంత్."

ఉత్తరం రెండుసార్లు చదువుకుంది దుర్గమ్మ.

కొడుకు తనకు పట్టుచీర కొనినందుకు ఎంతో సంతోషం కలిగిందామెకు.

తనకి పట్టుచీర !

యిన్నాళ్లకి, యిన్నేళ్లకి పట్టుచీర! యిన్నాళ్లుగా తీరని తన కోరిక యిక ఫలించబోతోంది. యిన్నేళ్లూ 'గగనకుసుమం'గా ఉన్న కోరిక, యీనాడు చేతికి అందబోతోంది.

తండ్రీ, భర్తా తీర్చలేని తన కోరిక కొడుకు తీరుస్తున్నాడు.

ఆమె మనసు ఆనందంతో పొంగిపోయింది.

"పిచ్చినాయనకి నేనంటే అభిమానం" అనుకుంది.

ఆమె మనసులో పట్టుచీర మెదిలింది.

ఎలా వుంటుందా పట్టుచీర? నీలం రంగుమీద పెద్ద పెద్ద పువ్వులేనా?

అదైతేనే బాగుణ్ణు...

అది కాకపోతే ?...

ఏదైతేనేం ? పట్టుచీరకదా ? అయినా తనకేరంగులిష్టమో అనంత్‌కి తెలీదూ ?

హఠాత్తుగా ఆమెకి తన పదిహేడేళ్ల వయస్సులో, అక్కపెళ్లిలో జరిగిన సంఘటన జ్ఞాపకం వచ్చింది.

"అంటే ఆ కోరిక తీరడానికి యిరవయ్యేళ్లకు పైగా అయిందన్నమాట." అనుకుంది.

కానీ వెంటనే తనకోసమని అనంత్ ఏమీ కొనుక్కోనందుకు ఆమె మనసు కొంచెం బాధపడింది. ఉత్తరం మరోసారి చదువుకుంది. "ఇక్కడ భోజనం ఫర్వాలేదు "

"పాపం వెర్రితండ్రి. ఎలా అయిపోయేడో ఏంటో ? అడిగినంత వడ్డిస్తాడో వడ్డించడో ఆ వెధవ ?" అనవసరంగా హోటల్ వాడిని ఆడిపోసుకుందామె.

ఆ తర్వాత భోజనానికి తను కూర్చోబోతున్న సంగతి జ్ఞాపకం వచ్చింది. వీధి తలుపువేసి భోజనానికి కూర్చుంది.

ఆరోజు ఆమెకి అంత ఎక్కువగా భోజనం సయించలేదు.

కొడుకు తనకి పట్టుచీర కొన్నాడన్న ఆనందం ఒకపక్కా, కొడుక్కి హోటల్ భోజనం పడలేదన్న బాధ మరొకపక్కా ఆమెని భోజనం చెయ్యనివ్వలేదు.

"తొందర్లో పెళ్లిచేసేస్తే, ఆ వచ్చేదే వాడికింత ఉడకేసి పెడుతుంది." అని అనుకుంది.

*   *   *

"అన్నయ్యుత్తరం రాసేడు నాన్నా! " అంది పద్మ. మధ్యాహ్నం కాఫీకి యింటికి వచ్చిన విశ్వనాథంతో

"ఏం రాసాడేమిటి ?" సంతోషాన్నీ, ఆతృతనీ అణచిపెట్టుకుంటూ అడిగేడు విశ్వనాథం.

"ఉత్తరం యిదుగో. చదవండి" అని అందించింది దుర్గమ్మ.

విశ్వనాథం కళ్లజోడు పెట్టుకుని ఉత్తరం చదవసాగేడు తన్మయంగా.

"మీకో పంచా, నాకోపట్టుచీరా, పద్మకో చీరా కొన్నాడట." అంది దుర్గమ్మ, భర్త చదువుతున్నా.

లతను ఉత్తరం చదవడం పూర్తిచేసి—

"పాపం ! వాడికోసమని యేంకొనుక్కోలేదు." అన్నాడు బాధగా.

పద్మకిదేం పెద్ద విషయమనిపించలేదు. "వాడికేం ? యీ నెల కాకపోతే, వచ్చేనెల కొనుక్కుంటాడు" అనుకుంది.

దుర్గమ్మ కాఫీ యిచ్చింది. విశ్వనాథం కుర్చీలో కూర్చుని కాఫీ తాగుతూ.

"అయితే పదిహేడో తారీఖున యిక్కడకు వస్తాడన్నమాట." అన్నాడు.

"యీరోజు పదోతారీఖు. అంటే యింకా వారంరోజులుందన్నమాట" అంది దుర్గమ్మ. ఆమాట కనీసం పదిహేనుసార్లయినా అనుకుని ఉంటుందామె.

'ఆ వారం రోజులూ ఎంత తొందరగా గడుస్తాయా ?' అనిపించిందామెకి.

ఆ తర్వాత విశ్వనాథం ఆఫీసుకెళ్లిపోయేడు ...

మరో మూడు రోజుల తర్వాత —

విశ్వనాథం ఆఫీసునించి యింటికి వస్తూనే —

"అబ్బ ఎందుకో కడుపులో నొప్పెడుతోంది దుర్గా" అన్నాడు కడుపు నొక్కుకుంటూ.

దుర్గమ్మకి కంగారుపుట్టింది. "ఎందుకు నొప్పెడుతోంది ? జ్వరంగానీ వచ్చిందా ?" అంది ఆవిడ చెయ్యిపట్టుకుని పరీక్ష చేస్తూ.

అంత బాధలోనూ దుర్గమ్మ కంగారుకి, విశ్వనాథానికి నవ్వు వచ్చింది. "కడుపునొప్పికీ, జ్వరానికీ సంబంధమేమిటి దుర్గా ?"అన్నాడు నవ్వుతూ.

"పోనీలెండి, మాత్ర తెప్పించమంటారా పద్మచేత ?." అంది.






"ఆఫీసు నుంచి వస్తూ దార్లో కొనుక్కున్నాన్లే."

"వేడి కాఫీతో వేసేసుకోండి అదే సర్దుకుంటుంది. ఎందుకొచ్చిందో, ఏమిటో ?" అంది వంటింట్లోకివెళ్తూ.

కాఫీ తయారు చేసి తీసుకువచ్చింది. విశ్వనాధం మంచంమీద పడుక్కున్నాడు. "ఏమండీ! డాక్టర్ దగ్గరకెళ్తే బాగుంటుం దేమో ?" అంది కాఫీ యిస్తూ.

"ఎందుకు దుర్గా అనవసరంగా ?" అని కాఫీతో ఆ మాత్రవేసుకునిపడుక్కున్నాడతను.

కడుపునొప్పి తగ్గిపోవాలని ఆ భగవంతుడికి వెయ్యి నమస్కారాలు పెట్టుకుంది దుర్గమ్మ. అయితే ఆ కడుపునొప్పి అంతటితో తగ్గలేదు. పైగా తొమ్మిది గంటలప్పుడు మరీ విజృంభించింది. అతను మరి భరించలేకపోయాడు.

దుర్గమ్మ కంగారుగా ఏడవడం మొదలెట్టింది. పద్మ పక్కింటి రామ్మూర్తిని పిలిచింది. ఆయన సాయంతో విశ్వనాధాన్ని డాక్టర్ దగ్గరకు తీసుకెళ్లేరు. ఆయనేదో పరీక్షించి 'నే చెయ్యగలిగింది ఏమీలేదు. కెజీ హెచ్‌కి.తీసుకెళ్లండి" అన్నాడు.

దుర్గమ్మకి దుఃఖం కట్టలు తెంచుకుంది. రిక్షా తిన్నగా కింగ్‌జార్జ్ హాస్పిటల్ దగ్గర ఆగింది. రామ్మూర్తి పద్మ దగ్గర నుండి అనంత్ అడ్రస్ తీసుకుని, 'ఫాదర్ సీరియస్. స్టార్ట్ ఇమీడియట్లీ"అని టెలిగ్రావ్ యిచ్చి వచ్చాడు. పద్మకి అంతకన్నా ఏం చెయ్యాలో తోచలేదు.

హాస్పిటల్‌లో డాక్టర్ ఆపరేషన్ చేస్తేనే గాని లాభం లేదన్నాడు.

"ఎలాగోలా అతన్ని బతికించండి డాక్టర్ గారూ!"అన్నాడు రామ్మూర్తి.

వెంటనే ఆపరేషన్‌కు ఏర్పాట్లు జరిగిపోయేయి విశ్వనాధాన్ని స్ట్రెచర్ మీద ఆపరేషన్ థియేటర్‌లోకి తీసుకు వెళ్లేరు.

దుర్గమ్మకి 'ఆపరేషన్' అన్నమాట వినగానే చాలా భయం కలిగింది. ఆమె, పద్మ ఏడవడం మినహా మరేంచెయ్యలేక పోయేరు. రామ్మూర్తి వాళ్లిద్దరినీ ఓదారుస్తూనే ఉన్నాడు

దుర్గమ్మకి హఠాత్తుగా, తన తండ్రికి గుండెల్లో నొప్పి రావడమూ, డాక్టర్ దగ్గరకు తీసుకు వెళ్లేలోపుగానే చచ్చిపోయిన సంగతీ గుర్తుకు వచ్చాయి ఎందుకో.

"భగవంతుడా! నన్నన్యాయం చెయ్యకు" అని దణ్ణం పెట్టుకుంది.

గంటకి పైగా గడిచిపోయింది. క్షణమొక యుగంలా గడిచింది ఆ గంటసేపూ. నిముష నిముషానికీ అక్కడున్న ఆరు కళ్లూ ఆపరేషన్ థియేటర్ తలుపులవేపు ఆశగా చూసేవి.

తర్వాత ఆపరేషన్ థియేటర్ తలుపులు తెరుచుకున్నాయి

"ఇరవై నాలుగు గంటలు గడిస్తేగానీ యే సంగతీ చెప్పలేం"అన్నాడు డాక్టర్.

విశ్వనాధాన్ని స్ట్రెచర్ మీద తీసుకువచ్చి బెడ్ మీద పడుకోబెట్టేరు. ముగ్గురూ ఆశగా అతని ముఖంవేపు చూడసాగేరు. దుర్గమ్మా, పద్మా మౌనంగా ఏడవసాగేరు. అనంత్ వచ్చేదాకా రామ్మూర్తి వాళ్లని ఓదారుస్తూనే వున్నాడు. అనంత్ అర్ధరాత్రి రెండుగంటలకు వచ్చేడు. అతను చాలా సేపట్నుంచీ ఏడుస్తున్నాడనడానికి అతని కళ్లలో యెరుపే సాక్ష్యం.

అతన్నిచూస్తూనే కౌగిలించుకుని మరో సారి ఏడిచింది దుర్గమ్మ.

అనంత్ కూడా పసి పిల్లడిలా ఏడవడం మొదలెట్టేడు.

"ఓయ్ అనంత్! మగవాడి వయ్యుండి నువ్వుకూడా ఏడిస్తే ఎలాగోయ్ ?" అన్నాడు రామ్మూర్తి.

"ఏదో దుఃఖం పట్టలేక ఏడిచేను. మా నాన్నగారి కెలా ఉంది?"అడిగేడు ఆత్రుతగా.

"ఆపరేషన్ చేసారు. ఇరవై నాలుగు గంటలు గడిస్తే గానీ ఏ సంగతీ చెప్పలేమన్నారు" అన్నాడాయన.

అనంత్ కొంచెంసేపు మాట్లాడలేదు. తర్వాత—

"మీరిక యింటికి వెళ్లండి రామ్మూర్తి గారూ! మా కోసం మీరు చాలా శ్రమ తీసుకున్నారు" అన్నాడు

"శ్రమేముందోయ్ ఇందులో? మన పక్క వాళ్లు ఆపదలో ఉంటే ఆదుకోవడం మన ధర్మం కాదా? భలేవాడివే."

"ఫర్వాలేదు లెండి. మా నాన్నగారినినేను చూసుకుంటాను."

రామ్మూర్తి వెళ్లిపోయేడు అనంత్‌తండ్రి కాళ్ల దగ్గర కూర్చున్నాడు. రెండోవైపు దుర్గమ్మ ఏడుస్తూ కూర్చుంది. ఆమెకి విశ్వనాధం కళ్లు తెరిస్తేనేగాని దుఃఖం తగ్గేట్టులేదు తలదగ్గర పద్మ నిలబడిఉంది. ముగ్గురూవిశ్వనాధంముఖంలోకిచూస్తున్నారు.

టైమ్ నాలుగున్నర దాటింది మరో సారి డాక్టర్‌వచ్చి టెంపరేచర్ నోట్ చేసుకున్నాడు. సంతృప్తికరంగా ఉందని అతని ముఖమే చెప్తోంది

"ఫర్వాలేదు మిస్టర్ అనంత్! కాస్త 'హోప్' ఉంది " అన్నాడు.

అనంత్ గుండె తేలికైంది కానీ దుర్గమ్మకి మాత్రం కంగారు తగ్గలేదు.

"థాంక్యూ డాక్టర్!" అన్నాడు కృతజ్ఞతగా. డాక్టర్ వెళ్లిపోయేడు

"అమ్మా! కాస్త కాఫీ తాగుతావా ?" అన్నాడు అనంత్.

"వద్దురా బాబూ! ఆయన కళ్లు తెరిస్తే గానీ నాకేదీ సయించదు." అందామె.

"నాకోసమేనా తాగమ్మా. రాత్రి నేను భోజనంకూడా చేయలేదు. అయినా, మరేం ఫర్వాలేదని డాక్టర్ చెప్పాడుగా." అన్నాడు.

దుర్గమ్మ అయిష్టంగానే ఒప్పుకుంది.

అనంత్ బయటకు వెళ్లేడు. పద్మముఖం కడుక్కోవడానికి వెళ్లింది.

దుర్గమ్మ విశ్వనాధం ముఖంలోకి బాధగా చూసింది.

"తామిద్దరూ కలిసి యిరవయ్యేళ్లకు పైగా కాపురంచేసేరు. ఇప్పుడాయన విడిపోతే తనాబాధ భరించగలదా ?... భగవాన్! నా మాంగల్యం కాపాడు." అని దేముడికి దణ్ణం పెట్టుకుంది. మంగళసూత్రం కళ్లకద్దుకుంది.

పద్మ లోపలకి వచ్చింది. కట్టుకున్న చీర కొంగుతో ముఖం తుడుచుకుంటోంది.

అనంత్ లోపలకి వచ్చేడు, కాఫీ గ్లాసులతో. దుర్గమ్మకీ, పద్మకీ రెండు గ్లాసులు అందించేడు.

సోమవారం



**ఫ్లాష్**
సమకూర్చే సున్నితమైన
ముఖక్షౌరంవలన ఎంతో నున్నగా
గెడ్డము గీసుకున్న అనుభూతి

మంగళవారం

అదనంగా
మరో 24 గంటలు
నిలిచే అనుభూతి

బుధవారం



**ఫ్లాష్**
సమకూర్చే సున్నితమైన
ముఖక్షౌరంవలన ఎంతో నున్నగా
గెడ్డము గీసుకున్న అనుభూతి

గురువారం

అదనంగా
మరో 24 గంటలు
నిలిచే అనుభూతి

శుక్రవారం



**ఫ్లాష్**
సమకూర్చే సున్నితమైన
ముఖక్షౌరంవలన ఎంతో నున్నగా
గెడ్డము గీసుకున్న అనుభూతి

శనివారం

అదనంగా
మరో 24 గంటలు
నిలిచే అనుభూతి




ఫ్లాష్ ఓ అద్భుతమైన బ్లేడ్. అది ఎంతో నున్నగానూ, సున్నితంగానూ గెడ్డాన్ని గీస్తుంది
నున్నగా గెడ్డాన్ని గీసుకున్న అనుభూతిని మీలో నిజంగా ఎంతో కాలం కలిగిస్తుంది

# పట్టు చీర

ఎండాకాలం కావడంవల్ల అయిదు గంటలకే తెల్లగా తెల్లవారిపోయింది.

* * *

"హమ్మయ్య! గండం గడిచిపోయినట్లే." అనుకుంది మరోసారి, దుర్గమ్మ.

అప్పటికిగానీ ఆమె గుండె తేలికపడలేదు.

ఆ చూపులనీ, ఆ చూపులలో ఆత్రుతనీ అర్థంచేసుకున్న విశ్వనాథం తృప్తిగా ఆమె కళ్లలోకి చూశాడు.

అప్పటికి విశ్వనాధాన్ని హాస్పిటల్ నుండి యింటికి తీసుకొచ్చి రెండు రోజులైంది.

"అమ్మా! ఈ రోజేం వండమంటావ్?" అడిగింది పద్మ వంటింట్లోంచే. ఈ రెండు రోజులూ దుర్గమ్మ,విశ్వనాథం మంచందగ్గరే కూర్చుంది.

"మీరీరోజు చారూ అన్నం తినొచ్చని డాక్టర్ అన్నాడుగా" అంది, భర్త వేపు ఆప్యాయంగా చూస్తూ.

అవునన్నట్టుగా తలఊపేడు విశ్వనాథం.

"కమ్మగా చారు పెడతానుండండి." అని లేచింది దుర్గమ్మ.

భర్త తనవంట యిరవైరెండేళ్ల నుండి తింటున్నా, ఆ రోజు మళ్లీ భర్తకి వండి పెట్టాలనిపించింది దుర్గమ్మకి.

వెంటనే స్నానంచేసి, దేముడికి పూజ చేసుకుంది. ఆ తర్వాత పొయ్యిమీద ఎసరుపడేసింది.

"ఏమే పద్మా! అనంత్ యింకా లేవలేదు కదూ?" దుర్గమ్మ అడిగింది.

"లేదు లేపమంటావా?"

'వద్దులే, పడుకోనీ. వెర్రితండ్రికి రెండు రోజులై నిద్దర్లేదు" అంది

మరో పావుగంటకే అనంత్ లేచాడు. ముఖం కడుక్కొని, వంటింట్లోకివచ్చి పీట వేసుకుని కూర్చున్నాడు. దుర్గమ్మ అనంత్‌కి ఫ్లాస్కులో కాఫీ యిచ్చింది.

పద్మకూడా వంటింటి తలుపుకి చేరబడి నిలబడింది.

"ఆరోజు రాత్రి నీకెన్ని గంటలకి టెలిగ్రామ్ అందింది?" అనడిగింది.

"రాత్రి పదకొండున్నరకి అందింది. వెంటనే బట్టలు వేసుకుని స్టాండుకు బయల్దేరేను ఆ టెలిగ్రామ్‌ని చూడగానే నాకు కాళ్లూ, చేతులూ ఆడలేదు. అసలేం చెయ్యాలో తోచలేదు తీరా స్టాండుకి వెళ్లేసరికి ఒక్క బస్సు కూడా లేదు. ఎలారా భగవంతుడా అనుకున్నాను. నిజంగా ఆ దేముడెప్పుడూ మనని ఓ కంట కనిపెడుతూనే ఉంటాడనుకో అమ్మా! అక్కడెవడో టాక్సీ వాడు "ఏ ఊరెళ్లాలిసార్?" అనడిగేడు. "వైజాగ్" అని చెప్పేను. "మా టాక్సీ వెళ్తోంది. వస్తారా?" అన్నాడు దేముడు దయ చూపించినందుకు దణ్ణం పెట్టుకుని బయల్దేరాను. డ్రైవర్‌కి చెప్పాను, యిలా మా నాన్నగారికి సీరియస్‌గా ఉందని, కాబట్టి నువ్వు వేగంతో తీసుకెళ్లాలని. "మీ కెందుకు సార్ మూడున్నర గంటల్లో వైజాగ్‌లో దించే పూచీనాది" అన్నాడు వాడు. నిజంగా అన్నమాట నిలబెట్టుకున్నాడు. వైజాగ్ వచ్చేసరికి నిండా మూడున్నర గంటలు పట్టలేదు. వెంటనే రిక్షాలో మన యింటికి వెళ్లాను. అక్కడెవరూ లేరు. తాళంవేసిఉంది. రామ్మూర్తిగారింటికివెళ్లి అడిగేను. వాళ్ళు చెప్పేరు, నాన్నగారిని కేజీహెచ్‌లో జాయిన్ చేసేరని! నా కెంతో ఏడుపొచ్చిందమ్మా! మళ్లీ అదే రిక్షాలో హాస్పిటల్‌కి వచ్చేసేను." అన్నాడు ముగిస్తూ.

అనంత్ చెప్పున్నంతసేపూ కూర తరుగుతూ వింటోంది దుర్గమ్మ.

"ఆ హడావుడిలో బట్టలే తీసుకురావడం మరిచిపోయాను పద్మా! ఆ ఫేంటూషర్టూ కాస్త సర్ఫ్‌లో పెట్టు" అన్నాడు అనంత్

"అలాగేరా."

"నేనింకా పదిహేడో తారీఖు ఉదయం వచ్చి, ఆ రోజు రాత్రికి బయల్దేరదామనుకున్నాను యింతలో యిలా జరిగింది లేకపోతే పద్మచీరా, నీ చీరా, నాన్నగారి పంచె తెచ్చేవాణ్ణే!" అన్నాడు.

"నీ కోసమేమేనా కుట్టించుకున్నావా?" దుర్గమ్మ అడిగింది.

"లేదమ్మా! వచ్చేనెల కొనుక్కుంటాన్లే. నీక్కొన్న పట్టుచీర చాలా బాగుందమ్మా! నీలంరంగు మీద పెద్ద పెద్ద పువ్వులు నీకు నీలంరంగంటే చాలా యిష్టమనే ఆ పట్టు చీర తీసుకున్నాను. నువ్వు ఆ చీర కట్టుకుంటే నిండుగా బాగుంటుంది" అన్నాడు అనంత్.

"నా కెందుకులేరా? ఆ చీర పద్మ కట్టుకుంటుందిలే" అంది దుర్గమ్మ తృప్తిగా.

అనంత్ తల్లి ముఖంలోకి ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయేడు.

అతని కళ్లముందు తల్లికోసం కొన్న పట్టుచీర మెదిలింది.











# మీరు చవిచూసే ప్రతి హనీ బీ బ్రాంది గుటకలోనూ ఫ్రాన్సు యొక్క చిన్న భాగం ఉంది




హనీ బీ బ్రాందీ చవిచూడండి

ఒక్క సారి ఫ్రాన్సుకి వెళ్ళిన అనుభవాన్ని పొందండి

## హనీ బీ బ్రాంది

ఆ ఫ్రెంచి అనుభూతి కోసం!



"మార్కెట్ చేయువారు హెర్బర్ట్ సన్స్ లిమిటెడ్"

"బాటిల్ చేయువారు మెక్‌డొవెల్ డిస్టిలరీస్"

# అమెరికాలో (మూఢ) నమ్మకాలు

— అరిశెట్టి రత్నమణి.

అమెరికాలో ఎన్నో మూఢనమ్మకాలు ఉన్నాయని కొన్నిటిని ఇప్పటికీ వాళ్ళు నమ్ముతారు అన్న సంగతి తెలుసుకున్నాక దూరపు కొండలు నునుపు అన్న సామెత గుర్తుకు వచ్చింది. మనం ఎప్పుడూ మన మతంలోని, మన నమ్మకాల లోను మన ఆచారాల లోను తప్పును చూస్తాం-అవతలి వాళ్ళవి గొప్పగా అనిపిస్తాయి. అందరికీ ఇది వర్తించదు గాని మొత్తంమీద అభిప్రాయం చెప్తున్నాను. ఎంత తప్పుగా తోచినా మన నమ్మకాలు ఆచారాలు అంత త్వరలో మానెయ్యలేం—ఎంత మెచ్చుకున్నా ఇంకొకరి నమ్మకాలు అలవర్చుకోలేం. మనలాగే తక్కిన వాళ్ళకి కూడా మూఢనమ్మకాలు ఉన్నాయని తెలిసిన నాడు మన నమ్మకాలు అంత తప్పుగా తోచవు.

## 13 వ అంకె

అమెరికన్లు ఇప్పటికీ బాగా నమ్మేది, పాటించేది అయిన నమ్మకంతో మొదలుపెడతాను. 13వ అంకె మంచిది కాదని, చాల దురదృష్టం కలగచేస్తుందని చాల నమ్మిక. ఇది ఎంతగా నమ్ముతారు అంటే బిల్డింగు కట్టేటపుడు 13 వ అంతస్తు కట్టరు. ఇళ్ళు కట్టేనపుడు కూడ 13వ నెంబరు ఇల్లు కట్టకుండా 12 తరువాత 14 అని పెడతారు. పొరపాటున కట్టినా కూడా సాధారణంగా ఎవరూ అందులో ఉండడానికి ఇష్టపడరు. దురదృష్టవశాత్తు ఇప్పుడు మేం ఉంటున్నది 13 వ నెంబరు ఇంటిలోనే అనుకోండి. మాకు ఆ విషయమే తోచలేదు. ఇంచుమించు మేం ఆ ఇంటిలో దిగిన 9,10 నెలలకు ఒక అమెరికన్ మా యింటికి రావడం జరిగింది. అతను ఇంట్లో అడుగు పెడుతూ మొట్టమొదటగా అడిగిన ప్రశ్న – "ఇంకేమీ దొరకనట్టు 13 వ నెంబరు ఇంటిలో ఉంటున్నారేమిటి ?" అని. 13 వ తారీఖు కూడా మహా అపశకునం. ఈ తారీఖున కొత్తపని, మంచిపని మొదలుపెట్టరు. ఈ 13 వ తారీఖు శుక్రవారం వచ్చిందంటే ఇక శని నెత్తిమీద ఉన్నట్టే.

## కాకి అరుపు

ఇంటిమీద కాకి అరుస్తుంటే చుట్టాలు వస్తారన్న సంగతి అందరికీ అనిపించేదే. అమెరికాలో కాకులు ఉండవు గాని చుట్టాలు వస్తారన్న సంగతి తెలియడానికి ఇంకొక ఆధారం ఉంది. కాకి అరుస్తుంటే చుట్టాలు వస్తారనే గాని ఆ వచ్చేది ఆడా, మగా, పిల్లలా అన్న సంగతి తెలియదు. ఇక్కడి నమ్మకం ఆ తేడా కూడా చూపిస్తుంది. ఫోర్కు చేతిలో నుండి జారి క్రింద పడితే ఆడవాళ్ళు చుట్టాలు వస్తారన్నమాట. అదే కత్తి అయితే మగవాళ్ళు, స్పూను ( చెంచా ) జారితే పిల్లలు. బాగుంది కదూ.

నల్లపిల్లి గొడవ ఇక్కడ కూడా ఎక్కువే. మనం ఎక్కడకి అయినా వెళ్తున్నప్పుడు నల్లపిల్లి కనిపిస్తే లోపలకు వచ్చి కాసేపు కూర్చుని కాళ్ళు కడుక్కుని బయలుదేరుతాం. ఆ దురదృష్టం మరీ ఎక్కువ సేపు ఉండదన్నమాట. ఇక్కడ కథ అలాగ కాదు. పిల్లి ఎదురయిందా అంటే ఆ దురదృష్టం 7 ఏళ్ల వరకూ పట్టి పీడిస్తుంది. ఈ నమ్మకం ఇక్కడ ఎవరికీ ఉండదు ఈ కాలంలో. ఇండియాలో కూడా ఎవరికో తప్ప ఈ నమ్మకం ఎక్కడా చూడం. ఈ 7 ఏళ్ళ దురదృష్టాన్ని కలిగించేది నల్లపిల్లి ఒక్కటేకాదు. నిచ్చెన క్రిందుగా నడిచినా, అద్దం పగలగొట్టినా ఈ దురదృష్టం తప్పదు. పిల్లిలాగే కుక్క విషయంలో కూడా ఒక పోలిక ఉంది. కుక్క ఏడుపు వినిపిస్తే ఆ చుట్టుపక్కల ఎవరికో చావు ముంచుకు వస్తుందని అంటారు.




కొన్ని బహుమతుల విషయంలో ఒక చిన్న నమ్మకం ఉంది. ఎవరికైనా పర్సుగాని, డబ్బు ఉంచుకునే ఏ వస్తువు అయినాగాని బహుమతిగా ఇస్తే అందులో ఒక సెంటు (పైసతో సమానం) పెడతారు. అలాగ అయితే ఆపర్సు డబ్బుతో నిండుతుందని నమ్ముతారు. ఇది మాత్రం ఇప్పటికి పాటిస్తారు.

## వారాల పట్టింపు

ఏదైనా పనిమీద వెళ్తున్నవాళ్లు గుమ్మం దాటి వెళ్లేక ఏదైనా మర్చిపోయి వెనక్కి తిరిగివస్తే ఆపని కాస్త జరగదు అంటారు. ఆ నమ్మకం ఇక్కడా ఉంది ఎవరైనా తెగ నవ్వుతుంటే అంటారు. నవ్వి, నవ్వి ఏడుస్తావు. అని అదే కొద్ది మార్పుతో ఇక్కడా కనిపిస్తుంది. ప్రొద్దున్న భోజనం పాడుతూ సంతోషంగా తింటే రాత్రి భోజనంఏడుస్తూ తింటారట. శుక్రవారంనాడు, పండుగపూట, రాత్రివేళ ఇల్లు తుడవకూడదని ఇక్కడా నమ్మకం ఉంది. శనివారంనాడు కొత్త పని మొదలు పెట్టకూడదంటారు.

## దిష్టి తియ్యడం

ఉప్పు పారపొయ్యడం మంచిదికాదు గాని ఎడమభుజం మీదుగా ఉప్పు విసిరి వేస్తే అది దురదృష్టాన్ని పోగొడుతుందట. ఈనమ్మకం, మనలో ఉప్పుతో దిష్టితియ్యడం ఒక దగ్గర నుండే వచ్చి ఉండవచ్చు. పంచదార పారపొయ్యడం ఉప్పుకన్న ఎక్కువ దురదృష్టాన్ని కలిగిస్తుందని నమ్మిక. మనలోలాగే ఇంటిలో అడుగు పెట్టే ముందు పక్కమీద నుండి దిగేటప్పుడు కుడికాలు ముందు పెట్టమంటారు.

## తుమ్ము

తుమ్ము విషయంలో కూడా మనలాగే వీళ్లకీ నమ్మకాలు ఉన్నాయి. మనలో తుమ్మగానే "చిరంజీవి" అన్నట్టు ఇక్కడ "దేముడు



ఈ నెల 2వ తేదీన విజయవాడలోని ఆంధ్రరత్న భవనంలో జరిగిన ప్రదేశ్ కాంగ్రెస్ అడ్‌హాక్ కమిటి సమావేశం దృశ్యం ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ప్రక్కనే శ్రీ వీరమాచనేని కూర్చున్నారు.

నిన్ను ఆశీర్వదించుగాక'' అని అంటారు. ఇప్పటికీ ప్రతివాళ్ళు ఇది పాటిస్తారు. మూడు సార్లు తుమ్మడం అదృష్ట సూచకం అట. క్రొత్త ఇంటిలో దిగేటపుడు ఒక బ్రెడ్‌ముక్క, కొంచెం ఉప్పు పట్టుకు వెళ్ళాలట. ఇది ఇంగ్లండులో చాలామంది పాటించే నమ్మకం.

ఏప్రిల్ ఫూల్

ఇంచుమించు ప్రతి దేశంలోను ఉన్నది, ప్రతి వాళ్ళు సంతోషపడేది ఏప్రిల్ ఒకటవ తారీఖున వచ్చే ఏప్రిల్ ఫూల్స్‌డే ఇది వసంత ఋతువుకు ప్రారంభం కాబట్టి పూర్వీకులు సంతోషం పంచుకోడానికి జరుపుకునే వారని చెప్పారు. ఈ రోజు సరదాలకు ఎవరైనా కోపంతెచ్చుకుంటే అది వాళ్లకు దురదృష్టం కలిగిస్తుందని నమ్మిక. ఈ రోజు పుట్టిన వాళ్లకి వ్యాపారంలో కలిసి వస్తుందని నమ్ముతారు.

ఇండియాలో చాల మంది బాగా నురగ ఉన్న కాఫీ తాగడం, ఇష్టపడడం చూసాను. అలాంటి వాళ్లకో చిన్న సలహా. కాఫీ రాగానే వెంటనే ఒక స్పూనుతో నురగ అంతటినీ త్రాగగలిగితే వాళ్లకి అనుకోకుండా డబ్బు వస్తుందట. (నమ్మకం మాత్రమే!) సిగరెట్లు కాల్చే వాళ్లకి ఒక హెచ్చరిక. ఒకే అగ్గిపుల్లతో మూడు సిగరెట్లు వెలిగించడం దురదృష్టాన్ని కలిగిస్తుందట ఇక్కడ చాలమంది అనేది– ఈ రోజా కారు కడిగితే మర్నాడు వర్షం పడుతుందని.

చంటిపిల్లలు—నమ్మకం

చంటి పిల్లల విషయంలో ఇండియాకు, ఇక్కడకు చాల నమ్మకాలు కలుస్తాయి. చంటి పిల్లలను టేపుతో కొలవకూడదని, పిల్లల మీద నుండి దాటకూడదని, ఇంటిలో నుండి పైకి తీసుకు వెళ్లడం మొట్టమొదటి సారిగా గుడికి తీసుకు వెళ్ళాలని–ఇవి ఇప్పటికీ ఇక్కడ చాలమంది పాటిస్తారు. ఇండియాలో అంటారు–అన్నం ముట్టించినపుడు పిల్లలు ఏ వస్తువు ముట్టుకుంటే అది వాళ్లకి ఎక్కువగా ఉంటుందని– ఆ ఎంపిక ఇక్కడ లేదు గాని బాప్టిజమ్ సమయంలో ఏడుస్తే వాళ్ళు గాయకులు అవుతారంటారు.

నదులలో పైసలు వెయ్యడం

గంగ, కృష్ణ మొదలైన నదులలో పైసలు వెయ్యడం 100కి 90 మంది చేస్తారు. అది ఇక్కడా చూసినపుడు చాల ఆశ్చర్యం అనిపించింది. కాకపోతే ఇక్కడ నదులలో పైసలు వెయ్యడం అన్నది కొంచెంతక్కువ. నూతులు వుండవు కాబట్టి ఎక్కువగా పైసలు కనిపించేది ఫవుంటెన్‌లలో. కాని వీటికి పవిత్రం అప విత్రం అన్నతేడా లేదు కాబట్టి దాదాపు ప్రతి ఫవుంటెన్‌లోనూ పైసలు చూస్తాం. రోములో కూడ ఈ నమ్మకం బాగాఎక్కువే.

అరచెయ్యి దురద

శుక్రవారం, ఆదివారం గోళ్ళు కత్తిరించుకోవడం మంచిది కాదని నమ్ముతారు. అరిపాదం దురద వేస్తే వాళ్ళు ఏదైనా కొత్త ప్రదేశానికి వెళ్తారట అరిచెయ్యి దురద వేస్తే అనుకోకుండా డబ్బు వస్తుందట. పుట్టినరోజు నాడు బర్త్‌డే కేక్ మీద ఉన్న కొవ్వొత్తులు అన్నీ ఒక్కసారే ఊదగలిగితే ఆ రోజున వాళ్ళు పొందిన ఆశీర్వచనాలు అన్నీ నిజం అవుతాయట. లీపు సంవత్సరం ఫిబ్రవరి 29 న పుట్టినవాళ్ళు చాల అదృష్టవంతులు అవుతారంటూరు. చావు బాజా ఎదురురావడం మంచిది కాదంటారు. అది ఇక్కడా ఉంది. అంతగా వస్తే పెట్టుకున్న టోపీ తీసేస్తే ఆ దురదృష్టం పోతుందని ఇంగ్లీషు వాళ్ల నమ్మకం. టోపీలేనివాళ్ల గతేమిటో!

సంఖ్యల నమ్మకం

అమెరికన్ ఇండియన్సులో నాలుగు సంఖ్య చాల పవిత్రం. మంగళహారతి ఎళ్లేం ముగ్గురు పట్టుకోవాలి అన్నట్టుగా వాళ్లలో శుభ కార్యాలలో పాటలు నలుగురు కలిసి పాడుతుంటారు. యూదులలో ఏడు పవిత్రమైన సంఖ్య. ఏడవ సంతానం కావడం చాల అదృష్టం అని వాళ్ళు నమ్ముతారు.

(46 వ పేజీ చూడండి)

రచయిత్రి మూడు సంవత్సరాలుగా అమెరికాలో న్యూ జెర్సీ రాష్ట్రంలో నున్న 'లోడై' అనే వూళ్ళో వుంటున్నారు. అక్కడ ప్రభుత్వ కార్యాలయంలో ఉద్యోగం చేశారు కూడా. వీరి భర్త 1966 నుంచి అక్కడే మొదట చదువు కోసం ఆనక ఉద్యోగం కోసం వుంటున్నారు. సం.

# వారఫలం

మహేష్

29–11–1974 శుక్రవారం మొదలు
5–12–1974 గురువారం వరకు

**మేషం :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. వారంఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు.

**వృషభం :—** మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. ఇతరులతో కలసిచేసే వ్యాపారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభించగలదు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాసవస్తువులు కొంటారు.

**మిథునం :—** వృత్తిలో శ్రమ కలుగు తుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలించగలవు. వ్యాపారంలో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కర్కాటకం:—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో వ్యతిరేకమైన వార్తలను వింటారు. ఉద్యోగంలో చికాకులు యేర్పడతాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో అనుకూలమైన మార్పులువస్తాయి స్త్రీలకు —కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**సింహం :—** మీ కంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో ప్రయాస మీది ప్రయోజనం - మరొకరిది కాగల పరిస్థితి యేర్పడు తుంది. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. అధిక వ్యయం జరుగు తుంది.

**కన్య :—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ప్రయాజనంగల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు —సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల :—** చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది వారం మధ్యలో అనుకూలవార్తలను వింటారు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. బంధువుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

**వృశ్చికం :—** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకుంటారు. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. వృత్తిలో ప్రయాసకు గురికావలసి వస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

**ధనుస్సు :—** రాజకీయ వ్యవహారాల్లో ప్రయాస కలుగుతుంది. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో వ్యతిరేక పరిస్థితి యేర్పడగలదు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. పాటివారితో మాటపట్టింపులు తగవు.

**మకరం :—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. కోర్టు వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు లాభిస్తాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకుంటారు.

**కుంభం :—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. పాటి వారిలో గౌరవం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. వారం ఆఖరులో మీ అంచనాలు తారుమారు కాగలవు. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**మీనం :—** వ్యాపారంలో పాటివారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. మొగమాటాలకు లొంగిపోవడంవలన శ్రమ కలుగు తుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్త్రీలకు —బంధు మిత్రులను కల్సుకొంటారు అనుకూలమైన వార్తలను వింటారు.

## * మినీ ఇంటర్‌వ్యూ *

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా వుంటూనే విశాఖ జిల్లా కాంగ్రెసు కార్యదర్శిగా ఎన్నుకోబడిన ఘనత ప్రథమంగా



శ్రీ హరనాథ్ కి దక్కింది. శ్రీ హరనాథ్ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎమ్. ఏ. పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయి, ప్రస్తుతం పిహెచ్. డి. కి థీసిస్ వ్రాస్తున్నాడు. "ఆధునిక ఆంధ్ర కవిత్వంపై పాశ్చాత్య వాదముల ప్రభావం" అనే విషయంపై ఈ థీసిస్ తయారుచేస్తున్నారు..

శ్రీ హరనాథ్ 1966 నుంచీ కూడా కళాశాల, విశ్వవిద్యాలయం విద్యార్థి రాజకీయాలలో ముఖ్యపాత్ర వహిస్తూ వచ్చినా, ఇటీవల ప్రత్యేకాంధ్ర వుద్యమంలో ఎక్కువ ప్రాధాన్యం లోకి వచ్చి, అగ్రశ్రేణి వ్యక్తుల జాబితాలో చేరాడు. విద్యార్థి దశలో మొత్తం 120 సార్లు వక్తృత్వ పోటీలలో పాల్గొనగా 116 సార్లు ఉత్తమ వక్తగా ప్రథమ బహుమతి పొందాడు. ఈ సంవత్సరం గుంటూరు హిందూ కాళాశాలలో సభచేసి, ఉత్తమ విద్యార్థి వక్తగా శ్రీ హరనాథ్‌ని సన్మానించడం వారికి దక్కిన ఒక అపూర్వ గౌరవం.

"విద్యార్థి దశలోనే జిల్లా కాంగ్రెసు కార్యదర్శి అయే పరిస్థితి మీకు ఎలా సంభవించింది?" అని ప్రశ్నించగా శ్రీ హరనాథ్ ఇలా అన్నాడు. "ఇందుకు నేను ఏమీ ప్రయత్నించలేదు, నేషనల్ స్టూడెంట్సు యూనియన్ కార్యదర్శి శ్రీ బి. జె. అగస్టిన్ ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుని, ప్రదేశ్ కాంగ్రెసుఅధ్యక్షులు శ్రీ వెంకటనారాయణని కలిసి కాంగ్రెసులో విద్యార్థులకి కూడా ప్రాతినిధ్యం కల్పించాలని కోరడం జరిగింది. ఇందుకువారు అంగీకరించారు. సాంఘిక సంక్షేమ మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి కాంగ్రెసు కార్యదర్శిగా రమ్మని నన్ను ప్రోత్సహించారు. ఈవిధంగా నేను కాంగ్రెసు రాజకీయాలలోకి రావడం జరిగింది" అన్నారు.

(జి. ఎస్. ఎస్.) ●

## లవ్ స్టోరీ

(15 వ పేజీ తరువాయి)

పరచకపోతే ప్రమాదం అని దీర్ఘంగా ఆలోచించి ఆమెకు యిలా రాసాడు.

మంగాపురం, 1-11-1974.

మై డియర్ లవ్,

చాలా రోజులనించీ మీతో చెప్పదలచుకున్న ముఖ్యమైన విషయం నా అదృష్టం కొద్దీ మీ పేరులోనే యిమిడి పోయింది. ఎటొచ్చీ మీ పేరుకి ముందు (మర్యాదకు) డు యూ అనే యింగ్లీషు మాటలు, చివర్ని ''మీ'' అనే తెనుగు పదం చేర్చాలి. జవాబు జరూరు.

ఇట్లు,

లవుడు.

తనపేరు ప్రేమ అంటే లవ్

దానికి ముందు డు యూ, చివర్ని మీ చేర్చాలిట !

అంటే — డు యూ లవ్ మీ !

అబ్బో లవుడుగారు చాలా గడుసుగా కన్పిస్తున్నారే.

ఇతని ప్రశ్నకి నా జవాబు కూడా తీసిపోకుండా వుండాలని వారం రోజులు తల్లక్రిందులై జవాబు తయారు చేసిందామె.

శ్రీకాకుళం, 10-11-'74.

లవుడు గారికి,

నా పేరులో యిమిడిపోయిన మీ ప్రశ్నకి జవాబు కూడా ఆశ్చర్యంగా మీ పేరులో యిమిడి పోయింది. ఎటొచ్చీ కొద్దిగా మీరు నా జవాబుని గ్రహించుకోటానికి పాటు పడాలి.

1. మీ పేరులోని వు అక్షరాన్ని వ్ గా మార్చాలి.

2. ఇప్పుడు లవ్ డు లోని లవ్ అనే రెండు అక్షరాలని తారుమారు చేసి రాయండి.

3. దానికి ఎడంవైపున యూ అనే పదం, కుడివైపున ఐ అనే పదం చేర్చండి.

4. ఇప్పుడు కుడివైపు నుంచి ఉర్దూ చదివినట్లుగా చదివి చూడండి.

ఇట్లు,

మీ లవ్.

ఆత్రుతగా లవ్ రాసిన లవ్ లెటర్‌ని విప్పిన లవుడుకి ఆ ఉత్తరం ఒక పొడుపు కథలా కన్పించే సరికి యిక గత్యంతరం లేక ఒక కాగితం, కలం తెచ్చి ఆమె చెప్పినట్లు వ్రాసి చూసుకున్నాడు. ఆమెపేరు లవ్ అతని పేరు లవుడు. వారిద్దరి లవ్‌స్టోరీ పేరు (లవ్) స్క్వేర్డు.

## అమెరికాలో (మూఢ) నమ్మకాలు

(41 వ పేజీ తరువాయి)

ఈ కాలంలోఎవరూ నోచుకోనిఅదృష్టంఇది.

ఎవరికైనా ఏదైనా వస్తే తక్కువ కాలంలో అదే మరి రెండుసార్లు జరుగుతుంది అన్న నమ్మకం ఇక్కడ ఉంది— కష్టం అయినా, సుఖం అయినా సరే ఎవరైనా కాలు జారి పడ్డారనుకోండి రెండు, మూడు రోజులలో గాని, ఆ రోజే గాని వాళ్లు ఇంకొక రెండుసార్లు పడక తప్పదన్నమాట.

### అవయవాల ఆకారం

మన అవయవాల సైజులనుబట్టి చాలా వాటిని నిర్ణయిస్తుంటారు అది ఇక్కడా చాల మంది చేస్తుంటారు పొడుగు చెవులు ఉన్న వాళ్లకి ఎక్కువ ఆయుష్యు ఉంటుందట పెద్ద చెవులు ఉన్నవాళ్లు చాల ఔదార్య వంతులు అంటారు చెవులుకుట్టించుకోవడం చాల మంచిదని, లది చెడ్డ శక్తులను తరిమే స్తుందని పూర్వీకులలో నమ్మకం ఉండేదట ఇపుడు చెవులు కుట్టించుకోవడం ఈనమ్మకం నుండే వచ్చిందని అంటారు కనుబొమలు దూరంగా ఉంటే వాళ్లు మాతృభూమికిచాల దూరంలో జీవిస్తారు అంటారు అదే దగ్గ రయితే దగ్గరలో ఉంటారట కనుబొమ్మలు కలిస్తే కష్టాలు వస్తాయని ఇంగ్లండులో నమ్మకం ఇలా కలిస్తే వాళ్లు చాల డబ్బుగల వాళ్లు అవుతారని ఇక్కడ నమ్మకం పళ్లు దూరంగా ఉంటే అది సంపదకి, సంతోషానికి చిహ్నం అట విజం చెప్పాలంటే ఇదంతా చిలక జోస్యం వంటిది



### కొండ గాలి

శ్రీ భూషణం రచించిన కొండగాలి (నవల) మా కార్యాలయం చేరింది 136 పేజీలు వెల మూడు రూపాయలు ప్రతులకు శ్రీ భూషణం, మేరంగి (పోస్టు), పార్వతీపురం తాలూకా, శ్రీకాకుళం జిల్లా


**Printed and Published by S NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada 3 Editor S Radhakrishna**

తప్పక చూడండి!





ప్రతి చిత్రంలో
కొత్తదనం అందించి
అందరి హృదయాలు
ఆకట్టుకున్న
శ్రీ కె. విశ్వనాథ్
విశిష్ట దర్శకత్వంలో
తయారైన మరొక మణిపూస

విజయలక్ష్మి మూవీస్

# అమ్మ మనసు

Veekay

నిర్మాత. జి.వి.యస్.రాజు

నార్త్ డిస్ట్రిబ్యూటర్లు ఆర్ట్ ప్రభాస్ ఎంటర్‌ప్రైజెస్ ★ నవయుగ ★ సీడెడ్ విజయలక్ష్మి మూవీస్

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA